# విప్లవ సమిధలు

(OVER THE ASHES)



మూలం :
మావ్‌గ్‌తిన్‌పి.

అనువాదం :
కె. అనంతాచార్య.



'నగారా' ప్రచురణాలయం,
గుంటూరు.

# ముందుమాటలు

**1944** సంవత్సరపు బర్మా రాజకీయాలే యీనాటకం-జపాను ఫాసిస్టు భూతాలు ఆసియాను ఏకఛత్రాధిపత్యంక్రింద ఏలటానికి ప్రయత్నించి ప్రపంచంపై సాగించిన దండయాత్రల్లో బర్మా ఒక రణరంగం! వాస్తవ పరిస్థితులదృష్ట్యా బర్మా ముఖ్య పట్టణమైన మాండలే ప్రాంతంలో జరిగిన యదార్థగాథ యిది... ఆనాటి కరువు కాటకం, దుర్భిక్షాలు, ప్రజల్లోరేగిన దుమారం వాళ్లల్లో కమ్యూనిస్టు యువకులు రేపిన జ్వాలలు, యిందులో మీకు కనిపిస్తాయి...

ఇలా బర్మా మూడు సంవత్సరాలు ఫాసిస్టు భూతాల బూటుకాళ్ల క్రింద నలిగి పిప్పయింది... రాచుకుని, రాచుకుని ఒకానొక సమయంలో అగ్ని పర్వతం బ్రద్దలైంది... ప్రపంచ ప్రజలు - ముఖ్యంగా మనదేశ ప్రజలు వాళ్లకు సాయం చేశారదేసమయంలో... వాళ్ల స్వాతంత్ర్యం సంపాదనకు మనసోదరులు చేసిన సేవ మరువరానిది...

ఇవన్నీ నాటి పరిస్థితులు... నాటక మూలరచయిత "మాంగ్ తిన్ పి" యీనాడు బర్మా యంగ్ కమ్యూనిస్టు పార్టీ ప్రముఖ నాయకుల్లో ఒకడు. ఇరువై సంవత్సరాల వయస్సులోనే నవలలు, వ్యాసాలు రచించి ప్రముఖ బర్మా అభ్యుదయ రచయితల్లో ఒకడయ్యాడు... సోదర యువకులకుమల్లే తనూ రాజకీయరంగంలో దూకాడు... జపాను ఫాసిస్టులు బర్మాను ఆక్రమించుకొన్న సంధియుగంలో తప్పుదారి త్రొక్కి "జాతీయ విప్లవపార్టీ" తరపున పనిచేసి జపానువారికి సహాయపడ్డాడు. కాని త్వరలో తనతప్పును తెలుసుకుని ఫాసిస్టు వ్యతిరేక విప్లవ పోరాటానికి నాయకత్వం వహించిన కమ్యూనిస్టు పార్టీలోచేరి విప్లవ నాయకుడై కొంతకాలం ప్రవాస జీవితం గడిపాడు జపానువారికి బాగుగా మట్టుపెట్టాడు...

## ii

1942 ప్రాంతాల్లో మనదేశం ప్రవేశించి, మనకళ్లు తెరపించి, జపాను వారి అసలుగుట్టును బట్టబయలు చేశాడు... అందుకు బర్మాలో ఏం జరిగింది? (What happend in Burma) అనే ఉద్గ్రంథం వ్రాసి, యదార్థ విషయాలు మనకుపదేశించాడు. కొంతకాలం ఫాసిస్టు వ్యతిరేక ప్రజా విముక్తి సంస్థకు విదేశాంగ వ్యవహారాల ప్రతినిధిగా (Anti fascist Peoples freedom League foreign affairs representative) పనిజేసాడు.

ఆనాడు బర్మాలో రేగిన విప్లవంలో స్వయంగా తనసోదరులకు నాయకత్వం వహించి, స్వాతంత్ర్యసాధనకు కృషిజేసేడు... తన మాతృదేవి కన్నీరు తుడిచాడు "మాంగ్ తిన్ పి".

మనం బర్మా ప్రజల ప్రతిఘటనల్ని ఎప్పటికీ మరచిపోలేం...

అన్యాయాలు తలలు వొంచుకుంటాయి...

న్యాయం జయించి తీరుతుంది...

ఇది సత్యం !

# ఇందులో పాత్రలు



యువాజా : ఒక ముదుసలి రైతు.

దాసోమి : ఆయన భార్య.

యూటిల్‌వాకా : వారి పెద్దకొడుకు. (బౌద్ధసన్యాసి)

మాంగ్‌పోషిన్ : రెండవ కుమారుడు.
ఓ చిన్న నూలుఫ్యాక్టరీలో కార్మికుడు.

టిన్‌మే : వారి కూతురు.

యూతిన్‌పా : ముసలాయన స్నేహితుడు.
మాజీ బ్రిటీషు యుద్యోగి. ప్రస్తుతంలో దారిద్ర్యాన్ని అనుభవిస్తున్నాడు.

మాషిన్‌యిన్ : పోషిన్‌యొక్క తీయని హృదయం.
పోషిన్‌తోపాటు ఫ్యాక్టరీలో పనిచేసే కార్మికురాలు.

మీభిన్ : మాషిన్‌యిన్‌వద్ద పనినేర్చుకుంటున్న ఓ చిన్నది.

హిరోశా : ఫ్యాక్టరీ యజమాని జపానువారి పెట్టుబడిదారుడు.

మాంగ్‌ఛిట్‌టిన్ : ఒక కమ్యూనిస్టు.

బాసాన్ : ఒక అవకాశవాది.

పోటోక్ : జపాను మిలటరీ పోలీస్ ఉద్యోగి.

హటా : జపాను ఆఫీసరు.
యూనివర్సిటీ చదువు ముగించి ఉద్యోగంలోచేరినవాడు.

మొదటి జపాను ఆఫీసరు : ఓ చిన్న దళనాయకుడు.

రెండవ జపాను ఆఫీసరు : జపాను మిలటరీ పోలీసుశాఖకు సంబంధించినవాడు.

ఇంకా జపాను సైనికులు, బర్మా గ్రామస్తులు, ఒకచిన్న కుర్రాడు మొదలైనవారు.



—O—

# విప్లవ సమిధలు

## ఒకటో అంకం

## (1-వ రంగం)

వెదురుకర్రల గోడలతో పైకప్పుగ తడికనుపయోగించబడిన గుడిసె ముందుభాగాన్న తాటిమట్టలతో చేయబడ్డబల్ల; అటువంటిరకపు కుర్చీలే నాలుగు. ఒకమూల నిప్పులపై కాగుతున్న టీ పాత్ర - ఉదయిస్తున్న సూర్యునికి అడ్డంగా చింతచెట్టు.

యాభైఏళ్లకు పైబడిన స్త్రీమూర్తి ఆ బల్లపై కూర్చొని చిరిగిన గుడ్డలు కుడుతుంటుంది. ఆమె కెదురుగా కుర్చీలో అరవైఏండ్ల వృద్ధుడు వెదురు బద్దలు చెక్కుతున్నాడు. ముప్పదిఏండ్ల యువక సన్యాసి మరొక కుర్చీమీద కూర్చొని ఆవిరిపై ఉడికిన చిక్కుడు గింజలు తింటూ మధ్యమధ్య "గ్రీన్‌టీ" సిప్ చేస్తుంటాడు.

స్త్రీమూర్తి తనపైగుడ్డ చంకల్లోకి అమర్చుకొని, వీపుపైన ఓ జనపనార ముక్కతో బుజాలు కనబడనీయకుండా కప్పుతుంది. చూపులకు వున్న వయసుకన్నా యెక్కువ ముసలిగ కనబడుతుంటుంది. చర్మంనిండా ముడుతలు; ముగ్గుబుట్టలా తల.

ముసలాయన మాసిన అతుకులబొంత కప్పుకుంటాడు. వయసుకు తగిన రీతిగనే కనబడుతుంటాడు. యువక సన్యాసి యింట్లోనే నేయబడిన గుడ్డలు ధరించి యుంటాడు.

యూంటిల్ వాకా :- (టీ ఆరబోస్తూ) ఓ భౌద్ధభిక్షుకులారా! ఇదీ నీ వరస...రాత్రింబగళ్లూ యిలా కుట్టుకుంటూ కూర్చొబట్టే కళ్ళలా దెబ్బతిని కూచుంటాయి. చెపు తున్నా...ఆపైన నీ యిష్టం...

దాసోమి :- (కుట్టు నిలిపి) ఏం చేస్తాం? ఇంతకంటే చేయాల్సిం దేమీలేదు. నాకున్న గుడ్డలన్నీ పేలికలై కూచున్నాయి. కుడదామన్నా పిగిలిపోతున్నాయి. ఈరోజుల్లో ఏదన్నా గుడ్డకొనాలంటే ముప్పయి, నలుభైదాకా ధరలు మండి పోతున్నాయి- తెలుసా?

యూంటిల్ వాకా :- (టీ ఊదుకుని, (తాగబోతూ,ఆగి నిట్టూర్చి) ఈ రోజుల్లో అన్నీ మండుతున్నాయి. ఒక్క ధరలే గాదు. క్రిందటి పౌర్ణమినాడు ఉపవాసానికి "యహాండ యాగి" పిల్లల్ని తీసుకరాలేదుగదూ! ఎందుకు తీసుకరాలేదనడిగితే "గుడ్డల్లేక" అన్నాడు. ఇలా ఎంత కాలం సాగుతుందిలే! త్వరలో మార్పులొచ్చి గుడ్డ చౌకలో చేతికందితీరాలి. జపాను నుండి ఓడలు దిగు తాయిలే!

దాసోమి :- (పరాకుగా) నమ్మకమేమిటి? తమరు శెలవియ్యాలి. ప్రభుత్వసైన్యాలు కట్టుకుంటున్న చింపిపేలికలను పరిశీ లించండి. ఈ సైన్యానికే తిండి, గుడ్డ యివ్వలేనప్పుడు యిక యీ ప్రభుత్వం మనకు సాయంచేస్తుందని నమ్మక మేమిటి?

యూంటిల్ వాకా :- మాతృశ్రీ అట్లు శెలవీయరాదు. ఎందు వల్లనంటే జపాను ఉద్యోగి "హాటా" తమదేశంనుంచి

త్వరలో ఒకపెద్ద బట్టలనావ వస్తుందని సెలవిచ్చాడు...
అదీగాక 'అడిపాడి' గూడ నిన్నటి వార్తాపత్రికలలో,
అందుకు తగినన్ని సన్నాహాలు జరుగుతున్నట్లుచెప్పాడు.

దాసోమి :- పత్రికల్లో విషయాలమాట నాకేం తెలియదు
గాని, జపానువాళ్లుమాత్రం దక్షిణాది పల్లెల్లో పండిన
పత్తిపంటంతా దోచుకుపోయారు. మనం దేనితో
గుడ్డలు నేసుకోవాలో నాకైతే తెలియటంలేదు. (అని
దేనికోసమో నిదానిస్తున్నట్లు చూస్తుంది)

యూటిల్‌వాకా :- మాతృశ్రీ మాటలు జాగ్రత్తగా మాట్లా
డాలి...జపానువారు పత్తిని కొన్నారుగాని దోచుకు
పోలేదు.

యూవాజా :- (చేతిలోనిపనిని త్వరగాముగిస్తూ) చిత్తగించాలి!
దక్షిణగ్రామాల్లోజరిగిన సంఘటనలనుబట్టి మీా జపాను
వారు చేసినపనిని స్వాధీనపరచుకున్నారు అని అనటం
కన్న దోచుకున్నారు అని అనటం తగివుంటుంది. తమరు
శెలవిచ్చినట్లు ''కొన్నారు'' అనేపదంమాత్రం తగదు.
ఆ గ్రామస్థులు తమ పత్తిని సొంతానికి వాడుకోవాలను
కున్నారు. అథవా మిగిలితే కావలసిన వస్తువులకు
మారకం చేద్దామనుకున్నారు...జపానువారికి అమ్మటం
అనేది ఎప్పటికైనా ''నష్టం'' అని అర్థం—

యూటిల్‌వాకా :- అయితే వారు 100 వీశెలపత్తి రు. 600 లు
యిచ్చి, కొనలేదన్న మాట?

యూవాజా :- ఇలాంటి మాటలు మనబోటి పేదరైతుల కళ్ళ
నీళ్లు తుడవడానికి వుపయోగిస్తున్నారు. వాళ్లు 600

యిచ్చినప్పటికీ మిగిలినవస్తువుల గిరాకీతో పోల్చిచూస్తే సంబంధం లేకుండావుంది. గ్రామస్తులు వాళ్ళకుసరుకులు అమ్మటానికి వీల్లేదన్నప్పుడు బలవంతంగా యిళ్ళల్లో జొరబడి సోదాలుచేసి నూరువీశెలదూదికి నూటయాభై రూపాయలు ముఖానకొట్టి, ఎదిరించినవారిని బెదరించి మరీ వసూలుచేయటమనేది మంచివద్ధతేగదూ? దీన్నే గదూ 'కొనటం' అంటారు!...

దాసోమి :- (ఇంకా అలాగే చూస్తూ) పిల్లదింకా రాలేదే?

మూటిల్‌వాకా :- (ఆదేది వినిపించుకోనక) అవును! కాలం గడ్డుగానేవుంది. వంటకాలుచేసుకోడానికి నూనె సమృద్ధిగా దొరకటంలేదు. 'టీ' నీళ్ళకుకూడా ముఖంవాచే రోజులొచ్చాయి. ఎక్కడైనా దొరికితే పైబట్ట కుదవ పెడితేనేగాని గొంతులో రెండుచుక్కలు జారేట్టులేదు. ...కాని, యిలాంటివన్నీ పెద్దకష్టాల్లో జమకిరావు ... జపానువాళ్ళల్లో యెంత మూర్ఖత్వం, మొరటుతనమూ వున్నా, వాళ్ళేగదా మనదేశంనుంచి ఆ ఇంగ్లీషుదేశపు పురుగుల్ని బయటకుగెంటింది? వాళ్ళవల్ల మనకు యిటువంటి చిల్లరమల్లర కష్టాలు ప్రాప్తించినా "మన స్వాతంత్ర్య సముపార్జనకు" సాయబడ్డవాళ్లు గనుక కృతజ్ఞత చూపాలని తండ్రిగారు గ్రహించాల్సివుంది ... సైనికమంత్రి 'ఆంగ్ సేన్' "స్వాతంత్ర్యం సంపాదించడమనేది దానిమ్మచెట్టు పాతిపెట్టటమంత చులకన గాదు. దాని ఫలితం అనుభవించడానికి చాలాకాలమూ శ్రమ అవుసరం." అని శెలవిచ్చారు...గుర్తుందిగదూ?

యూవాజా :- (వెదురుబద్దలన్నీ కుప్పగాపెట్టి) ఎప్పటిదో నీడ కోసం యిప్పుడు మండుటెండలో నిలుచునే రకంగాదు నేను - నువ్వు నన్నందుకు "దద్దమ్మ" అనవచ్చు. కాని, నువ్వుచెప్పే స్వాతంత్ర్యమేమిటో నా కర్ధమవటం లేదు. మనభూమిలో మనం పైరువేసుకోవడానికి అధికారం లేకపోవడం స్వాతంత్ర్యమా ? మనం మనచేతులారా చెమటోడ్చి పండించుకున్న పంటను మరొకడు తీసుకుంటుంటే నోరు మెదపడానికి వీల్లేనిది స్వాతంత్ర్యమా ? పరాయి జపాను సైనికులు మన కళ్లెదురుగ మన పశువుల్ని తోలుకుపోతుంటే అదేమని అడగటానికి వీల్లేని మనం స్వాతంత్ర్యం అనుభవించుతున్నామని చెప్పుకోవడం మనల్ని మనం చంపుకోడానికన్నా హీనం. ఘోరం! ఈ దౌర్జన్యాలను సహించాల్సిందేనా? ఇదేనా స్వాతంత్ర్యమంటే? అయితే యిందులో నీకు కనబడ్డ మంచియేమిటి?

(ఇంతలో ఏడుపు శబ్దం... ఇరవై సంవత్సరాల యువతి, వెక్కి వెక్కి ఏడుస్తూ, విరియబోసిన తలతో గుడ్డలు మన్తైరంగంపైకి ప్రవేశించి యింట్లోకి దూసుకు పోతూంది)

దాసోమి :- (గాభరాగా) ఏమిటే ? ఏమిటే ? ఏంజరిగిందమ్మాయ్ ?

(యూవాజా చెక్కుతున్న వెదురుకర్రను ప్రక్కన పెడతాడు... యూటిల్‌వాకా త్రాగుతున్న టీ కప్పు పక్కనపెట్టి ఏం జరిగిందన్నట్లు పిల్లకేసి తీక్షణంగా చూస్తుంటాడు.)

దాసోమి :- (పిల్లను అనుసరిస్తూ) చెప్పవే అమ్మా? ఏంజరి
గిందో, నీ తల్లిని - చెప్పవే? ఏంజరిగిందే?

యూటిల్‌వాకా :- (కూర్చున్నచోట్లోంచి లేచి) ఏంజరిగిందో
చెప్పు టిన్‌మే!

యూవాజా కర్తవ్యరహితంగా పక్కపెట్టిన వెదురుబద్దను తీసిచెక్కి మళ్లీ వెంటనే అక్కడపెట్టి పరధ్యానంగా చితిలోని కత్తిని అలాగే పట్టుకుని వుంటాడు. కొంతసేపటికి లోపల్నించి ఏడుపులు తగ్గుతాయి. యూటిల్‌వాకా లేచినుంచిని పిచ్చివాడిలా యింటివైపుకేసి చూస్తుంటాడు....

దాసోమి :- (లోపల్నుంచే) ఎంత పశుత్వం? దేవుడు వీళ్లకు
దిక్కుమాలినచావు ప్రసాదించడుగదా! కడజాతి
కుక్కలు...

యూవాజా చేతిలోని చాకుతోనే ఇంట్లోకి ప్రవేశిస్తాడు. యూటిల్‌వాకా వెనుకముందులకు పచార్లుచేస్తూ కప్పులోకి టీ కుమ్మరించుకుని నిలుచునే తాగుతుంటాడు. యూవాజా కోపంతో వూగిపోతూ యింట్లోంచి బయటకొస్తాడు.

యూటిల్‌వాకా :- ఏంజరిగింది? చెప్పండి! చెప్పండి!

యూవాజా :- (కత్తితిప్పుతూ) నీ ప్రియమైన జపానువాళ్లు...
(యూటిల్‌వాకా ఆయనకేసి దీర్ఘంగా చూస్తాడు...)

యూవాజా :- అవును! మీ ప్రియమైన జపానువాళ్లు!

యూటిల్‌వాకా :- జరిగిందేదో నువ్వయినా చెప్పమ్మా?

యూవాజా :- (బిగ్గరిగా-రుద్ధకంఠంతో కత్తిని వూగిసలాడిస్తూ)
తమ పూజ్యులు, జపానువాళ్లు నా కుమార్తెను తమ
సోదరిని - చెరిచారు. ఇప్పుడర్థమైందా?

యూటిల్‌వాకా చేతిలోని కప్పు వ్రేళ్ళపట్టుజారి క్రిందబడుతుంది... తను మెల్లగా కుర్చీలోకి కూలబడతాడు......

— క్రమంగా తెరకూడ —

# (2-వ రంగం)

ఒక బౌద్ధస్థూప ప్రాకారంలో, మూడువైపులా చెక్కలతో అమర్చబడి, పైభాగాన్ని చీనారేకుతో కప్పబడియుంటుంది. చెక్కలు అమర్చబడని నాలుగో భాగం ప్రేక్షకులవైపుకుంటుంది. గదిలోపల రెండు పరుపులు దోమతెరలతో అలంకరించబడి యుంటాయి. పరుపులకు కాళ్ళవైపున గాజుతో పరుచబడ్డ మేజాబల్ల...దానికిరువైపులా రెండు కుర్చీలు... ఒకటి పేముకుర్చీ. అది జపాను ఆఫీసరుకు ప్రత్యేకించబడ్డది. మరొకటి సాధారణమైనది. ఆగంతకుల కుపయోగించేది...ఒక కాపలావాడు వాకిలి దగ్గర నీరసించి ప్రాణంపోయినవాడిలా అటూయిటూ తిరుగుతుంటాడు...

దాసోమి ప్రవేశించి ఎందుకో నిదానించి రెండడుగులు ముందుకు వేస్తుంది, కాపలావాడు ఎటో పరాకుగా చూస్తూ వచ్చినమనిషిని గమనించడు... ఒక్క క్షణం...

దాసోమి :- ప్రభువులు! మహాప్రభువులు!

కాపలావాడు :- (అదిరిపడి చుట్టూ తిరిగి) బర్మాతల్లా! ఏం కావాలి మీకు?

దాసోమి :- (వినయంగా వంగి) నమస్కారం!

కాపలావాడు :- (కోపంగా) దయ్యంలాగా- ఎందుకొచ్చావో చెప్పు?

దాసోమి :- (బాధాకరంగా నవ్వి తలెత్తిచూస్తూ) మీ అయ్యగారిని చూడాలి.

కాపలావాడు :- వీల్లేదు. వారు నిద్దరోతున్నారు.

దాసోమి :- (తీవ్రంగా) చూచితీరాలి ... చాలా అవుసరం! (బిగ్గరగా) అవును! నేను చూచితీరాల్సిందే!

కాపలావాడు :- (ఆమెను వెనక్కు-నెడుతూ) దయ్యమా!ఫో... ఫో...వీల్లేదు...నడు...

దాసోమి :- (ఈనిన ఆడపులి అవుతుంది ... పెదాలు వణుకుతాయి. కళ్లు జేవురించి ఎర్రగా మారాయి. మనిషి నిట్టనిలువుగా నిల్చుంది....గర్జిస్తూ) నేను పోవడానికి వీల్లేదు. నా కూతురికి జరిగిన పరాభవాన్ని గురించి ఫిర్యాదుచేయాలి. నేనాయన్ను చూచితీరాలి, వెంటనే ఆయన్ను మేలుకొలుపు.

కాపలావాడు :- (చూపుడువేలూపుతూ, బిగ్గరగా) వెంటనే వెళ్లు...ఆయన నిద్రపోతున్నాడని చెప్పలేదు!

దాసోమి :- నేను పోను...నీచులారా! మీరంతా మా పిల్ల దాన్ని హింసించారు...నేను పోను...

కాపలావాడు :- (చెయ్యొట్టుకుని బలవంతంగా వెనక్కుత్రోస్తూ) వెళ్ళిపో...లేకపోతే చంపేస్తా...

ఈ గలాభా లోపల పరుపులపైబరున్న యిద్దరిలోనూ ఒక ఆఫీసరును లేపుతుంది. దోమతెరను తొలగించుతాడు. చిన్న డ్రాయరు, బన్నీను ధరించి యుంటాడు. పైకి మెలిదిరిగిన ముక్కుపైనుంచి యిరుకైన ఆ రెండుకళ్ళతో చూస్తున్నాడు...నిద్రనుంచి లేవటంవల్ల బద్ధకానికి కళ్లు విరుచుకుంటాడు.

జపాను ఆఫీసరు :- (కాపలావానితో) అరే వెధవా! ఏమిటా అల్లరి?

కాపలావాడు దాసోమిని వెనక్కునెట్టటం మానివేస్తాడు.

జపాను ఆఫీసరు :- (కోపంగా నిన్నేరా వెధవా! మాట్లాడవేం?

కాపలావాడు :- (ఆఫీసరువద్దకు పరుగెత్తుకొచ్చి సెల్యూట్ కొట్టి) ఒక బర్మా వృద్ధురాలు తమ దర్శనార్థం వచ్చింది సార్!

జ-ఆఫీసరు :- (వళ్లువిరుస్తూ) వృద్ధురాలా? ఛీ-సరే. లోపలికి రమ్మను.

విసుగ్గా అటూ యిటూ తిరుగుతుంటాడు. కాపలావాడి రాకవల్ల లాభంలేకపోగా నిద్రచెడినందుకు లోపల తిట్టుకుంటూ కొంకెకు తగిలించిన టోపీ ధరించి కుర్చీలో కూర్చుంటాడు. ఇంతలో దాసోమితో కాపలావాని ప్రవేశం.

జ-ఆఫీసరు :- ఏమమ్మా? ఏమిటి విషయం?

దాసోమి :- మహాప్రభువులు! నమస్కారం!

జ-ఆఫీసరు :- నమస్తే! నమస్తే! ఏంకావాలి? (విసుగుతో)

దాసోమి :- తమదయ! తమ సైనికులు మా పిల్లదాన్ని అవమానపరిచారు.

జ-ఆఫీసరు :- (తలపంకిస్తూ) ఘూత్! అయితే మంచిది-ఎప్పుడు?

దాసోమి :- (కోపంగా) యివాళప్రొద్దున్న-బజారు కుక్కలు.

జ-ఆఫీసరు :- (చలించక) ఎవరువాళ్లు?

దాసోమి :- తమ సైనికులు!

జ-ఆఫీసరు :- అంటే? నా దగ్గర చాలామంది సైనికులున్నారు. అందులో ఎవరూ అని? నేరస్థులెవరో గట్టిగా గుర్తుపట్టి చెప్పగలవా?

దాసోమి :- వాళ్ళు మీ సైనికులే! దోషులెవరో తమరే విచారించి తెలుసుకోవాలి-

జ-ఆఫీసరు :- (నవ్వుతూ) అసంభవం-నువ్వే వాళ్ళను వెతికి పట్టి యిచ్చుటకు తీసుకురా-శిక్షిస్తా! కానపుడు నేనేం చేయలేను.

దాసోమి :- మీ సైనికుల్ని మేమెలా పట్టుకోగలం?

జ-ఆఫీసరు :- ఫో! ఫో! వెతికిపట్టి యిచ్చుటకు తీసుకురా—నీవు వాళ్ళను తీసుకునిరాని పక్షంలో నేనేమీ చేయలేను. ఫో! ఫో! (కావలావానితో) ఒరేయ్! ఈమెను బయటకు గెంటేసి కాస్త పంచదారనీళ్ళను తీసుకురా.

దాసోమి :- నే నిక్కడనుంచి కదలను. మీరు వాళ్ళను శిక్షించాల్సిందే! యిప్పటికిప్పుడు వాళ్ళను పిలిపించి విచారణజరిపి—దోషుల్ని నిర్ణయించాలి.

కావలావాడు :- (ఆమె చెయ్యిని పట్టుకుని బలవంతంగా బయటకు గెంటి) ఫో!. ఫో!.

దాసోమి :- నేనుపోను... పోను... పోవడానికి వీల్లేదు... ఛీ కుక్కా! ఛీ పురుగా! పక్షి! పశువా!

జ-ఆఫీసరు :- అరేయ్! రెండుపోట్లు పొడవరా – తిక్కకుదురుతుంది.

కావలావాడు :- (బుజాన్నుంచి తుపాకిని క్రిందకుదించి లాఠీతో బెదిరిస్తూ) యిప్పటికైనా ఫో.

దాసోమి :- (కావలివాని చేతుల్లోంచి తప్పించుకుని ఆఫీసరు ముందుకుపోయి) కుక్కకొడకా! దిక్కులేనిచావు చస్తావులే! ప్లేగో, కలరావో వచ్చి నిన్ను తుడుచుకుని పోతుందిలే! ఆబాంబేదో నీ నెత్తిన పడుతుందిలేరా.

కావలావాడు :- (కొడుతూ, నెడుతూ, యీడ్చుకపోతుంటాడు) బయటికి నడువు – ముసలిపీనుగా—

తెరలోపల్నుంచి పెద్ద దెబ్బలు, దాసోమి ఏడ్పులు, అరుపులు తిట్లూ వినబడి కొంతసేపటికి క్రమంగా తగ్గిపోతాయి.

జ-ఆఫీసరు :- (నిల్చొని వింటూ, గొణుగుతాడు) చెరచటం! చెరచటం! చెరచటం! ఎప్పుడూ యిదే మాట! వెధవలు! దీనికి నాసైనికుల్ని నేనేమని చెప్పి అరిగట్టగలుగుదును? వాళ్లు ఇళ్లువదలి అయిదారుసంవత్సరాలాయె! నేనేం చేస్తాను? (విసురుగా నెత్తిమీది టోపీని పరుపు పైకి విసురుతాడు)

— వెంటనే తెరపడుతుంది —

# రెండో అంకం
## (1-వ రంగం)

ఫిబ్రవరినెల మొదటిరోజు సాయంసమయం. బాటుల కూడలిస్థలంలో ఊడలుదిగిన మర్రిచెట్టు. వెనుకవైపున ఒక పల్లె – చెట్టు మొగదల ఒక రాతిబల్ల. కొద్దిదూరంలో ఉచితస్థానంలో ఒక నీటికుండ. చెట్టునుంచి చిగుళ్ళు, ఆకులు రాలిపడివుంటాయి. చెట్టు రంగస్థలానికి ముందుభాగంలోవుంటుంది. నీటికుండ దానివెనుకవైపున కనపడుతుంటుంది.

ఒక జపాను యువక మిలటరీ ఆఫీసరు. నల్లని కళ్ళద్దాలతో, మురికి దుస్తులలో (Uniform) నడుంనుంచి ఒక రివాల్వరు వ్రేలాడదీసి చెట్టుకూ నీటికుండకూమధ్య కనుపించుతాడు. వచ్చి, ఆ రాతిబల్లపై ఉపవిష్టుడై ముఖంపైని చెమటబిందువుల్ని జేబురుమాలుతో తుడుచుకుంటుంటాడు.

జ.మి.ఆ.ఆఫీసరు :- ఘూత్ తెరీ! యీ వూరి మొత్తానికిద్దరా!

ఇరువురు గ్రామస్తులు ప్రవేశం - ఒకడు ఒక యువకుడు. మరొకడు వృద్ధుడు. ఇరువురి రొమ్ములు గాలికి తెరువబడియుంటాయి. వృద్ధుడు నడుముకు పాతబడి మాసి చీలికలూ పేలికలూ అయిన గుడ్డను చుట్టుకొనియుం

టాడు. యువకుడుకూడా అటువంటిరకపు దుస్తుల్నే పసుపుపచ్చ రంగులో ధరించియుంటాడు. పేదరికం వారి ముఖాన్న తాండవిస్తుంది. ఆ నీటికుండకు కొద్ది దూరంలోవారు కూర్చునివుంటారు. ఒక జపాను సైనికుడు ఒక తుపాకిని బుజాన్న వ్రేలాడవేసుకొని వారివద్ద నిల్చొని వుంటాడు.

మాంగ్ బాసెన్ :- (రంగంలో ప్రవేశించి, తనవైపుకు చూచుకుని) డాక్టరు 'బామా' నాకంటే బాగా వుంటాడా? (చేతికర్ర తిప్పుకుంటూ రంగంపై అటూయిటూ మీదు ముఖ్యంగా పచార్లుచేసి, జ.మి.పో.ఆఫీసరును సమీపించి కొత్తరకంగావున్న టోపీని నెత్తిమీదనుంచితీసి అతని ప్రక్కన కూర్చుంటాడు) పలినవారు అలిసిపోయారను కుంటాను.

జ.మి.పో.ఆఫీసరు :- (చెట్టుకానుకుని) పక్కగ్రామం యిక్కడి కెంతదూరంవుంటుంది?

మాంగ్ బాసెన్ :- ఎంతోదూరంవుండదు.

జ.మి.పో.ఆఫీసరు :- యిక్కడిలాగే అక్కడివాళ్లుకూడా గ్రామంలోంచి అదృశ్యమౌతారా?

మాంగ్ బాసెన్ :- అబ్బే! అలా జరుగదు. నాకక్కడ కావాల్సినంత పలుకుబడివుంది.

జ.మి.పో.ఆఫీసరు :- ఈగ్రామం విషయంలోగూడా మీరలాగే పలికారుగాని, ఒక్కడూలేడు.

మాంగ్ బాసెన్ :- అబ్బే! వాళ్లలా వెళ్లిపోయారనుకోను. ఎక్కడికో, ఏ పనిపాటలకో వెళ్లివుంటారు! ప్రక్క గ్రామంలో మన ప్రచార ఆయుధంతో మనం నెగ్గగలం. మీకు తెలుసునో లేదో-తూర్పు ఆశియావాసు

లను గురించి యుద్ధాన్ని గురించి బర్మాదేశీయులు తమ పవిత్ర రక్తాన్ని స్వాతంత్ర్య పోరాటంకోసం ఎలా అర్పించారో. ఆస్వాతంత్ర్యాన్ని మనసైన్యాల్లోచేరి ఎలా సురక్షితం చేసుకోగలరో, వాళ్లెలా తిండి, గుడ్డ, యిల్లూ, ఆరోగ్యవిషయాలు సంపాదించుకుని కాపాడుకోగలరో - యివన్నీ మనం కరపత్రాలద్వారా వివరించాం గదండీ!

జ. మి. పో. ఆఫీసరు :- మంచిదే! ఇక్కడకూడా మనం ఆవిధంగానే భారీయెత్తున ప్రచారం చేశాంగదా? అంత కష్టానికి ఫలితంగా యీ యిద్దరు మనుష్యులుమాత్రం మన కంటికి కనుపించగలిగారు. అందుకు మనం కొంచెం అధికారం ఉపయోగించాల్సి వచ్చిందిగూడాను. వాళ్లైనా కాస్త సందుదొరికితే తప్పించుకపోయి యుందురు. కష్టించి పనిచేయటమంటే యీ బర్మా భూతాలకు యింత బద్ధకమెందుకో! (యిద్దరు గ్రామస్తులవైపుకు దిరిగి) యీవూళ్లో మిగతా వెధవలంతా యెక్కడికి చచ్చారు. (వాళ్లు కళ్లప్పగించి చూస్తారు) జ. మి. పో. ఆఫీసరు (తుబుక్కున వూస్తూ) బండ వెధవలు! వీళ్ల దగ్గర సమాధానాలు తీయటం రాతిబండల్లోంచి సమాధానాలు రాబట్టంవంటిది - (ఎదుటి సిపాయితో) చెరొకతన్ను తన్నరా-అవే సమాధానం పలికిస్తాయి.

సిపాయి :- (యిద్దర్ని గట్టిగాతన్ని) చెప్పండి! మిమ్మల్నే (తన్నింది తమనుగాదన్నట్లుగా గ్రామస్తులుప్రవర్తిస్తారు. సిపాయి వారిని తిరిగి తిరిగి తంతాడు.)

మాంగ్‌బాసెన్ :- (గ్రామస్తుల్ని సమీపించి) మిత్రులారా! ఏలినవారికి జవాబియ్యండి-జపానువారికి సాయపడండి. వారిని సోదరులుగ భావించండి. మీరు నామాటవింటే నేను మీగురించి, మాగొప్పగా పైవారికి చెప్పగలను. మీకు ఆడిపాడి ప్రభువుల సతీమణి దగ్గరినుంచి మంచి నడతగలవారని పట్టితెస్తాను. అప్పుడు మీరు గ్రామ పెద్దలవుతారు. ఊఁ... చెప్పండి...

వృద్ధుడు :- (విధేయతారహితంగా) మాకేమీ తెలియదు. మీరెక్కడికి తీసుకెళ్లితే అక్కడికి రావడానికి సిద్ధంగా వున్నాం.

జ.మి.పో. ఆఫీసరు :- (ఎటువైపుకో దూరానికి చూస్తూ రెండడుగులు ముందుకువేసి చిరునవ్వుతో) వాహ్వావా! బలే బలే! ఇటొచ్చి చూడవయ్యా మహానుభావా!

మాంగ్‌బాసెన్ :- ఆఫీసరు దగ్గరికివచ్చి ఆయన చూస్తున్న వైపుకు పరిశీలనగా చూస్తుంటాడు.) ఏలినవారు అదేమిటో శెలవిస్తారా?

జ.మి.పో.ఆఫీసరు :- ఎవరో సైకిల్‌వాలా వస్తున్నాడు. నేనాతని బైక్ తీసుకోవాలి. నాకు చాలా వుపయోగంగావుంటుంది ప్రయాణానికి. చాలా అలసిపోయియున్నాను.

మాంగ్‌బాసెన్ :- మంచిది. అలాగే కానివ్వండి...

జ.మి.పో.ఆఫీసరు, మాంగ్‌బాసెన్‌లు సైకిల్‌వాలాకు ఆగమని సంజ్ఞ చేస్తారు. సైకిల్‌వాలా ముప్పయిసంవత్సరాల యువకుడు. చిరిగినప్పటికీ పరిశుభ్రమైన లాగూ చొక్కాలు ధరించియుంటాడు. బుజాన్న వేలాడుతున్న సంచి, నెత్తిన వెదురుటోపీ, కాళ్ళకు వెదురుతోతయారుకాబడ్డ పాదరక్షలు.

మాంగ్‌ఖిట్‌టిన్ :- (వినయపూర్వకంగావంగి) ఏలినవారు, నమస్కారం! (మాంగ్‌బాసెన్‌నుగూడా ఆ రీతిగనే గౌరవించి) బర్మా పుత్రులు! నమస్కారం! ఆడిపాడి దీర్ఘాయుస్సు గలిగియుండుగాక!

జ.మి.పో.ఆఫీసరు :- (ఒకడుగు వెనక్కు వేసి చేతులుదించి) బర్మా వర్ధిల్లుగాక!

మాంగ్‌బాసెన్ :- (అలాగేచేస్తాడుకాని వెనకడుగువెయ్యడు.) ఆడిపాడి వెయ్యేళ్లు వర్ధిల్లుగాక!

మాంగ్‌ఖిట్‌టిన్ :- (అతివినయంగా) ఏలినవారు నావల్ల ఏమి సాయముకోరుతున్నారో శెలవిస్తారా?

జ.మి.పో.ఆఫీసరు :- (కృత్రిమమైన చిరునగవుతో) మిత్రమా! బర్మాసోదరా! నీ బైక్ కావాలోయ్.

మాంగ్‌ఖిట్‌టిన్ :- (సంచినుంచి కరపత్రంతీసి) యింతటి ముఖ్యమైన పనిగనుక నాకులేకపోతే ఎప్పుడో యీ బైక్ మీ చేతుల్లో వుంచేవాడిని. ఈ కరపత్రాలు తూర్పుఆశియా యుద్ధప్రచారానికని తమకు తెలియందిగాదు. యీ గ్రామాల్లో కరపత్రాలు పంచమని నన్ను నియమించారు. ఆపైన నేను కల్నల్ ఓషిమా దగ్గరికి వెళ్లాల్సిన పనియున్నది.

జ.మి.పో.ఆఫీసరు:- (నిరాశతో) అవునవును! తప్పదు చాలకష్టం! చాలకష్టం! యీ పనికి సైకిళ్లు, మోటారుబైకులుకూడా పనికిరావు. అవుసరానికి వాహనాలు మనకందుబాటులో వుండేయిగావు. ఊళ్లుతిరగలేక కాళ్లూ వేళ్లూ ఎక్కడికక్కడికి వూడిపోతున్నాయి.

శ్రీ వేమన గ్రంథాలయము
వేటపాలెం. (కృష్ణా జిల్లా)

మాంగ్ ఫిట్‌టిన్ :- శాంతించండి. ఓపిక జేసుకోవాలి. కష్టా లన్నీ యిటువంటి సమయాల్లోనే ఎదుర్కొంటాయి. ఇటువంటి కష్టాల్ని భరించే ఆశియాను జయించాల్సి వుంటుంది. గెలుపు మనదయింతర్వాత శాంతిసౌఖ్యమూ వెతుక్కుంటూవస్తాయి.

జ.మి.పో. ఆఫీసరు :- ఘూత్ తెరే! ఆతూర్పు ఆశియా యుద్ధా న్నిగురించిగాని, యుద్ధం ముగింపు విషయంగానియెత్తుకు అలాంటి విషయాల్ని గురించి మనం ఎక్కువగా మాట్లా డగూడదు. ఇప్పటికి ఏడు సంవత్సరాలనుంచి యుద్ధం చేస్తున్నాం. మన ప్రధాని "టోజో" మరింకెంతో కాలం యుద్ధం అనవసరం. త్వరలో అంతా సమాప్త మౌతుంది. గనుక మీరలాయుద్ధం ముగింపుగురించి, విశ్రాంతిని గురించి పలువరించడంవల్ల ఏమీ లాభం లేదు. అన్నాడు. మనపని మనకష్టాలతో పోట్లాడటమే! బహుశా మనకు బస్సు సర్వీసు అందుబాటులో లేక పోతే జంతువుల్ని తెప్పిద్దాం-అథవా జంతువులూ దొర కపోతాయి, కనీసం మనుష్యుల్ని లాక్కొద్దాం-వాళ్లై నాదొరుకుతారో లేదో సందేహమే! ఎక్కడ కష్టాలు పడుతున్నారో సైనికులు, అక్కడికి ఆసదుపాయాలుచేస్తే బాగుంటుంది. సాయుధబలంతో శత్రువులు మనల్ని ఎదు ర్కొంటే మన ప్రాణాలే అడ్డువేయడానికి మన ప్రాణాలు మనకు చేదయితేగా? (మధ్యమధ్య ఉగ్రుడౌతాడు) మనందేనికీ లెక్కచేయనక్కరలేదు. చూడాల్సిందల్లా ప్రస్తుత కర్తవ్యం-మన విషయాలు మనం చూచుకో

వాల్సిందే! (అటూయిటూ తిరుగుతూ) ఎవరెలాచస్తే మనకేం? మనం చావక సుఖంగా బ్రతకడం మనక్కా వాలి-రోడ్లనిర్మాణానికి, విమానాశ్రయాలు బాగుచేయ డానిగ్గాని, మనకు ప్రస్తుతం, తగిన మనుష్యసంపత్తి అవు సరం! – డబ్బిచ్చి వాళ్లను తీసుకరాలేకపోయినప్పుడు మాటలుచెప్పి లాక్కురావాలి. అదీగాకపోయినప్పుడు అబద్ధాలతో మోసగించాలి. అథవా అదీ పనిచేయలేక పోతుందీ మన పశుబలాన్ని ప్రదర్శించి అవుసరం తీర్చు కోవాలి-మంచిది! ఇదిగో యుబాసెన్! లే,పోదాం పక్క గ్రామంలోకూడా మనుష్యులు గనుపించకపోతారా, ఊళ్లో మంటలు లేపుదాం-కుక్కల కొడుకులు! (తల వంచుకుని వూగుతూ నడిచి వెళుతుంటాడు.)

మాంగ్ ఛిట్ టన్ :- (బైక్ ముందుకుతోస్తూ) నమస్కారం!

జ.మి.పో.ఆఫీసరు :- మంచిది! నమస్కారం!

మాంగ్ బాసెన్ :- (సగర్వంగా ఆఫీసర్ని అనుసరిస్తూ ఛిట్ టన్‌తో) నేనూ పోతాను. నేనాయన్ను వదలడానికి వీల్లేదుగందా – నక్కతో నాగలోకం – తెలియందయితేగా?

మాంగ్ ఛిట్ టన్ :- (గ్రామస్తులవైపుకు చూచి) అదే చాల మంచిపద్ధతి.

గ్రామస్తులు దూరాన్నుంచి ఆఫీసర్ను అనుసరిస్తారు. సిపాయి నిండుగా మంచినీళ్లు త్రాగుతాడు. గ్రామస్తులు ఛిట్ టన్ వైపుకుచూచి స్నేహపూర్వకంగా నవ్వుతారు.

వృద్ధుడు :- (యువకునితో) ఆ మహానుభావుడే యీ జపాను భూతాలు పల్లెల్లోకి వస్తున్నారని హెచ్చరిక చేయడానికి వెళ్తున్నాడు.

యువకుడు :- (గుండెనిబ్బరంచేసుకొని) అతడే మనల్ని కాపాడగలడేమో!

వాళ్లు సాగిపోతుంటారు. చెట్టుచాటుకి అదృశ్యమౌతాడా సైకిల్ వాలా, జపానుసైనికుడు చేతిలోని నీటిగ్లాసును విసిరిపారేసి పరుగెత్తుతూ వాళ్ళను వెంబడిస్తాడు.

—తెర పడుతుంది—

# (2-వ రంగం)

సాయం సమయం - జపానువారిచే నిర్వహింపబడుతున్న ఒక నేత శాలలో నొకమూల. ఒక బర్మాకుర్రాడు దూదిని శుభ్రపరుస్తుంటాడు. మధ్యలో ఒక బర్మాపిల్ల రాట్నంపై దారం తీస్తుంటుంది... మిగిలిన మగ, ఆడపిల్లలు 10 మొదలు 18 ఏండ్లవారు దారాన్ని వుండలుగ చుడుతుంటారు. అంతా నలభై మందుంటారు. కాని అందరూ కనుపించరుగాని, వారు చేసే శబ్దాలుమాత్రం వినిపిస్తుంటాయి... వారుపయోగించే పరికరాలన్నీ మన పూర్వీకులుపయోగించే పరికరాలను బోలివుంటాయి.

మీాభిన్ :- (పిల్లవైపుకు దిరిగి) సాయంగావాలి! నేను తీసే దారమూ సరిగాలేదు...ఒక్కచోట లావు ఒక్కచోట సన్నమూనూ.

మాసిన్‌యిన్ :- (సొంతపనిఆపి) అయ్యోపిల్లా! యింకా చాతకాలా? (పిల్లవైపుకు వెళుతుంది.) నీకసలు ఏకుపట్టుకోవటమేచేతకావటంలేదు...అసలక్కడేవుంది కిటుకంటాను..

మిాభిన్ :- ఇకనుంచి ఆలాగే తీస్తాను...

మాసిన్‌యిన్ :- మాటసామెతకేగాని, నేనన్నిసార్లు చెప్పలేదు. నువ్వెన్నిసార్లు నేర్చుకోలేదు... అంతా తెలిసిందేగా, ... అంతచేతకానిదానివి మానేయరాదు!

పోషిన్ అనే యువకుడు ప్రవేశించి, సానుభూతితో పిల్లవంక చూచి ఆమెవైపు నడుస్తాడు...

మిాభిన్ :- (అతివినయంగా) యీసారికలా మరచిపోను...తప్ప కుండా బాగా తీస్తాను...

మాసిన్‌యిన్ :- మంచిది....మరోసారికి నేను చెప్పటమంటూ వుండదు. యథాప్రకారమే అయితే యీ పనినుంచి మానుకోవాల్సివస్తుంది.

మాంగ్‌పోషిన్ :- (వారికి దగ్గరగా నిల్చొని) ఆఁ! ఆఁ! శాంతిం చాలి.

మాసిన్‌యిన్ :- (చిరునవ్వుతో) నాకా శాంతము, ఓర్పూ లేక పోలేదు...ఎన్నిసార్లుచెప్పినా నేర్చుకుందామనే ధ్యాసే వాళ్ళకు లేకపోతే —

మాంగ్‌పోషిన్ :- అవును. వాళ్ళకందులో వుత్సాహమూ, సంతోషమూ అంటూవుంటేగా? ఎలావుంటుంది? యీ వయస్సులో బళ్ళోచదువుతూ, ఆడుతూవుండాల్సిన పిల్లలు ..జపానువారి ధర్మమాఅంటూ యింతింత బుడి తలు కూడా రోజంతా ఆటపాటలుకట్టేసి పనిచేస్తుండా ల్సిన యోగంపట్టింది —

మాసిన్‌యిన్ :- (లేస్తూ) నా గదిదగ్గరకు రా - అక్కడ మాట్లాడుకుందాం-ఇదిగో మిాభిన్, నేను చెప్పినట్లు

శ్రద్ధగా చేయి, - అదేవస్తుంది (నడున్తూమెల్లగా) ఇదిగో పోషిన్-అలా జపానువాళ్ళను గురించి ఎక్కడబడితే అక్కడ ఎక్కువగా మాట్లాడకు — యీ పిల్లల్నందర్ని గుచ్చిగుచ్చి అడిగి వాళ్ళనుగురించి ఏమి మాట్లాడు కుంటున్నదీ తెలుసుకుంటారా జపానువెధవలు.

మాంగ్‌పోషిన్ :- (క్రిందకూర్చుని) అవునవును — పొరబడ్డాను వాళ్ళలా అడుగుతుంటారని తెలుసు—అయితేనేం నా బోటి మందమతి పరాకు చిత్తగిస్తుంటాడు-ముల్లుగర్రతో మతిమరపు పోగొట్టడానికి నీలాంటివారు ఎంతైనా అవ సరం...(నవ్వుతాడు)

మాసిన్‌యిన్ :- (దారపుచుట్టపై చేయివేసి) తెలివిగల మగ జాతి లక్షణమే యింత!

మాంగ్‌పోషిన్ :- (గంభీరంగా) మాసిన్‌యిన్! మనం త్వరలో పెళ్ళిచేసుకోవడం మంచిది—

మాసిన్‌యిన్ :- మాంగ్‌పోషిన్! తొందరపనికిరాదు. పనులు, మాటలనుకున్నంత త్వరగా జరుగవు. ఈ కష్టకాలంలో తలదాచుకోవడానికి కొంప దొరకడమే ఒక పెద్దగండం.

మాంగ్‌పోషిన్ :- అబ్బే! అల్లాగాదు. అలా ఎప్పటికీ అనుకో వద్దు-వెంటనే పెళ్ళిచేసుకుందాం-అవునవును—

మాసిన్‌యిన్ :- (కొంతసేపుండి) నేనలా ఒప్పుకోను పోషిన్-

మాంగ్‌పోషిన్ :- నాకు తెలుసు! ఆ హీరోకావెధివిగాడి పల్లా డగొడితేసరి - వాడివల్లో చిక్కని చెడిపోతున్నావులే.

మాసిన్‌యిన్ :- అదిగాదు. ఆలా ఎప్పుడూ అనుకోవద్దు అన వసరంగా ఏడ్పిస్తున్నావు నన్ను.

హిరోకా ప్రవేశం-నలభైఏండ్ల వయస్సు-కొద్దిగా వంగియుంటాడు-క్రింది పెదిమను కప్పుతూవున్న పళ్లు-టూత్ బ్రష్‌లాంటి మీసకట్టు - పేంటు, సిల్కు చొక్కా నెక్‌టై తొడుక్కొని యుంటాడు. చేతిలో ఒకపొట్లాం. పోషిన్‌వైపు అకస్మాత్తుగా కలతపడ్డవాడిలా చూస్తాడు.

హిరోకా :- నీపని నువ్వుచూచుకోక యితర్లనిగూడా చెడగొడుతున్నావా? కూసేగాడిదొచ్చి మేసేగాడిదను చెడగొట్టిందట!

పోషిన్ తనపని చూచుకోబోతాడు. మాసిన్‌యిన్ లేచి ఆవచ్చిన జపానువాడికి వినయంగా వంగుతుంది.

మాసిన్‌యిన్ :- పని చాలావరకు పూర్తిఅయినట్లేనండి.

హిరోకా :- (విశాలంగా నవ్వుతూ చేతులుచాచి ముందుకు నడుస్తూ) మంచిది. చాలామంచిది. (ఆమెదగ్గరికొచ్చి) మాసిన్‌యిన్ పని కొనసాగించుతూ యీ హిరోకా ఒక కానుక మరేమీలేదు; ఒక మస్లిన్ సిల్కుగుడ్డ సమర్పించుకుంటున్నాడు. యిటువంటిగుడ్డను నువ్వు ఎక్కడైనా, ఏబజారులోనైనా కొనలేవు. తెలుసునా? నేను గనుక సంపాదించాను. యిదిగో తీసుకో - యీగుడ్డలే ధరించాలి. (ఆమె గుడ్డలవైపు చూస్తూ) ఛీ, ఛీ. యీ గుడ్డలు నువ్వు తొడగాల్సినవిగావు - ఆరకమంతా అలగాజాతివాళ్లకు చెందుతుంది. నీకింకా ఏమైనా కావాల్సుంటేఅడుగు. యీదాసుడు అర్పించుకుంటాడు; నీ పాదాల దగ్గర హి...హి...హి... నీకివి నచ్చలా? నాజూగ్గా లేవూ?

మాసిన్‌యిన్ :- (జపానుభాషలో వందనాలర్పిస్తూ)ఆలీకతావ్! ఆలీకతావ్! నాకోసం మీరంతా శ్రమపడకండి. మీరు నాపైనచూపిన దయకు కృతజ్ఞురాలిని (దూరంగా జరిగి) చాలా మంచిది. యివాల్టికి నూటయాభైవీశెల నూలు తయారైంది.

హిరోకా :- వాహావా! బేషుగ్గావుంది - యిప్పటికైనంతవరకూ సెంట్రల్‌డిపోకు పంపు. అక్కడి నేతగాళ్లు నూలుకు, బేరగాళ్లకు ఎదురుచూస్తూ గాడిదలకుమల్లే మత్తెక్క కాళ్లుబారజాపుకుని కూర్చున్నారు. హి...హ్హి...హి... హి...హ్హి...హి...ఆగు, కొంతసేపు ఆ పనికట్టిపెట్టు- ఒక చిన్నప్రశ్న - నువ్వెక్కడుంటున్నావ్? చెప్పవూ?

పోషిన్ యిదంతా చూస్తూ మండిపడి, తనకోపమంతా నూలుచుట్టలపై చూపుతుంటాడు.

మాసిన్‌యిన్ :- నాయిల్లా-ఇక్కడికి చాలాదూరం-

హిరోకా :- హి...హ్హి...హి...హి...హ్హి ... హి ... ఓ! ఏమంతకష్టంగాదు, నాకో కారుంది. దాంట్లో నిన్నింటి దగ్గర దిగబెడతాలే! మనకేమిటి? కావాల్సినంత డబ్బు! తెలుసా? మనకు కారూ, కావాల్సినంత పెట్రోలు ఎప్పుడుకావాలంటే అప్పుడు దొరుకుతుంది.

మాసిన్‌యిన్ :- అబ్బే! నే నింటికెళ్లటంలేదిప్పుడు! మీ దయకభివందనాలు -

హిరోకా :- (దగ్గిరిసావస్తూ) మరేంఫరవాలేదు. ఒక్కసారి అలా పోయివద్దాం రద్దూ!

మాసిన్‌యిన్ :- (ఒక్కడుగు వెనక్కువేసి) నేను గుడికెళ్ళాలి.

హిరోకా :- (విశాలంగానవ్వి)మంచిది...చాలమంచిది...మా జపానువాళ్ళంగూడా ఉత్తమ బౌద్ధమతస్థులమే! అయితే రా! వెంటనే గుడికి బయలుదేరు—

మాసిన్‌యిన్ :- (ఒక్కక్షణం ఆగి, మీభిన్‌వైపుకు చూచి) మీభిన్!

మీభిన్ :- (లేచినిల్చుని) అమ్మా!

మాసిన్‌యిన్ :- (మీభిన్ దగ్గరికెళ్ళి, చేయందుకుని, పోషిన్ వినేటట్లుగా) నాతో గుడికి రావాలి మీభిన్-

మాసిన్‌యిన్ మీభిన్‌లు చేతులు కలుపుకొని నడుస్తారు. హిరోకా వెంబడించి, యిద్దర్ని చెరోచేతితో పట్టుకుని నడచిపోతాడు. పోషిన్ ఉగ్రుడై చేతున్న పనిని ఆపి, కళ్లెర్రచేసి చూస్తుంటాడు...

— తెరపడుతుంది —

# (3-వ రంగం)

రాత్రిసమయం...రంగంమధ్యలో నొక భావి...మైదానప్రదేశం... నక్షత్రాలు స్పష్టంగా గనబడుతూ, మసకవెన్నెలజిమ్మే ఆకాశం...భావి ప్రక్కన యిద్దరు యువకులు నిలుచుని, స్నానానికి సన్నిద్ధులౌతున్నారు...

పోషిన్ :- (నీళ్లు తోడుతూ) బాగుంది...బాగుంది ...చాలా బాగుంది...అయితే నేనే వెళ్ళుతాను...

ఛిట్‌టిన్ :- (బొక్కెన భావి అంచునబెట్టి) మంచిదే! అలాగైతే ఆమాటని యితర్లదగ్గర యేమాత్రమూ పొక్కనియ్యకు. అక్కడే నీ మాటకారితనాన్ని, సమయస్ఫూర్తిని నీవు వుపయోగించాలి... అవసరాన్నిబట్టి కనిపిం

చకు. లేదా మారువేషాలు తగిలించు. ఆఖరికి నీ ప్రేయసి హృదయాన్నిగ్గూడా తెలియనీయగూడదు... తెలుసా?

పోషిన్ :- నాకంతా తెలుసు మిత్రమా! కాని నే నేమి చెయ్యాలో చెప్పు.

ఛిట్‌టిన్ :- మొదటిదిప్రచారం...అందుకు, నీవేం చెయ్యాలో నీకే తెలుసు...ఈ మిత్రరాజ్యాల గెలుపువల్ల తిరిగి మనకు వెనుకటి పరిస్థితులొస్తాయని చెప్పలేం! అందువల్ల మన స్వాతంత్ర్యంకోసం మన రక్తమాంసాలు ఎరవేసుకోవాల్సిందే! యీవిషయం ప్రజల్లో ఘాటుగా నాటుకుపోయేటట్లు ప్రచారంచేయి... అందుకు మనకు మనం ఎలా నిలదొక్కుకొని కృషి చెయ్యాలో బోధించు. అదంతా మనం యీఫాసిస్టు భూతాల్ని నేలమట్టం చేయటంతో ఫలిస్తుంది... యీ విషయం ప్రతి బర్మా స్వాతంత్ర్య వీరుడెల్లా గ్రహించేటట్లుచేయి!

పోషిన్ :- (తాదూపుతూ) ప్రచారంచేయటం ఏమంత గొప్ప సమస్యలోదిగాదు... పార్టీవారు వేయించిన కరపత్రాలన్నీ అక్కడే వున్నాయి-అంతకంటే యేమన్నా ముఖ్య విషయాలుంటే చెప్పు...

ఛిట్‌టిన్ :- జనుల్లో విప్లవం తీసుకరావాలి... బర్మా ప్రభుత్వం జపానువారి చేతుల్లో ఎలా కీలుబొమ్మగా ఆడుతుందో, ప్రజాసామాన్యం గుర్తించాలి... మనం చెమటోడ్చి, కండలు కరిగించి, సేకరించుకున్న ధనధాన్యాలను ఆ పరాయి జపాను ప్రభుత్వం ఎలా దౌర్జన్యంగా

ఊడబెరుక్కుంటున్నదో అందుకు మన బర్మా ప్రభుత్వం ఎలా గుడ్లప్పగించిచూస్తూ మురిసిపోతుందో, పైగా వారికెలా సాయంచేస్తుందో అంతా విడమర్చి చెప్పాలి. వారిలోని నిప్పుకణికలపై మసిదులిపి జ్వాలలు రేపాలి... విప్లవశంఖం పూరించాలి...

పోషిన్ :- నాదొక చిన్నమనవి ... జపానువారు దేశమంతా స్వయంరక్షక సంఘాలంటూ ఏర్పరుస్తున్నారుగదా - మనంకూడా అందులోజేరి విజృంభించవచ్చునేమో?

ఛిట్‌టిన్ :- మంచి ఊహే తట్టింది ... అందులోనివాళ్లను గనుక మనం కూడగట్టుకోగలిగితే మనం ఒక అడుగు ముందుకు సాగిపోగలం! (బకెట్‌ను ఎత్తుతూ) కాని ముఖ్యవిషయం ఏమంటే - మిత్రరాజ్య సేనలు అక్కడ దిగబోతున్నాయి... వాళ్లకు సాయం చేయగలిగితే మన ఆశయం ఫలించగలదు...

పోషిన్ :- అదేమంత కష్టంగాదు... కాని, యీసేనలక్కడ ఎక్కువ కాలముండవు... వాళ్లటు వెళ్లిపోగానే, వారికి మనం సాయంచేసిన విషయంగనుక యీజపాను వాళ్లు పసిగడితే, బాధపడేది యీ పల్లెవాళ్లే!

ఛిట్‌టిన్ :- అంతదూరం రావడానికి కారణం, మన పల్లెప్రజల్లో తగినకట్టు లేకపోవడమే! ఎవరో కొంతమంది ద్రోహులు ఎలాగో రహస్యాలన్నీ కనుక్కుంటారు. అసలు కీల కాన్ని అక్కడే పసిగట్టాలి... మన బర్మా సోదర ప్రజాన్నీకాన్నంతా కూడగట్టుకుని, వారిలో ఐకమత్య

తను కలిగించాలి... మిత్రమా "నేను కమ్యూనిస్టును" అని యెప్పుడూ కల్లోనైనా అనగూడదు... నీవంటి రాజకీయభావాలు లేనివారిపట్ల నీ అసమ్మతిని తెలువగూడదు... ఎటువంటి భావాలున్నవాడైనా, వా డే పార్టీకి చెందినవాడైనాసరే, జపానువారిని ప్రతిఘటించే ప్రతివాడూ మన సోదర సభ్యుడే! అప్పుడు మనం బ్రిటిషు తొత్తులనైతేం గుప్పిట్లోకి తెచ్చుకోగలం! ఇది కమ్యూనిస్టుల యుద్ధంగాదు! ప్రజాయుద్ధం అని తెలుసుకో-అందువల్ల గ్రామీణుల ఐక్యతను గురించి ముఖ్యంగా ప్రచారంచేయి-. ఉదాహరణకు వేరుశనగ పంటను తీసుకో - జపానువారి చేతుల్లోకి పంటలు పడకుండాచేయి... వారినొక గొడుగు క్రిందికి చేరదీసుకున్నట్లయితే మిత్రరాజ్యసమితి సేనలు క్షణాల్లోలొంగి మనకు సహకరించవచ్చు-ఇందులోకి కొన్ని నల్లమేకలు చేరి కలసిపోవచ్చు-కాని, వాటిని ఓకంట కనిపెట్టి తప్పించక పోతూండు... ఆ మేకల్ని తప్పించి అంతా మనకు సానుకూలంగా నడిచేవాళ్లే.

పోపిన్ :- అవును! మనకష్టాల్ని, అపాయాల్ని బలంగా యెదుర్కొనే ఇనుపగోడను నిర్మించాలి.

ఛిట్ టిన్ .- ఇది చాలాముఖ్య విషయం! మన ప్రజలు తమ ఇరుగు పొరుగు రాజ్యాల్లో ఏం జరుగుతుందో, మన భవిష్యత్తేమిటో, పరిస్థితులెలా మారుతున్నాయో తెలుసుకొని యుండాలి. కారణాలు యుద్ధంవల్ల గలిగిన మార్పులు, బాంబుల ప్రేలుళ్ళవల్ల గలిగిన

అరిష్టాలు, రాజకీయాల్లో గలిగిన మిట్టపల్లాలు చెబు తాయి-అంతేగాని, వాస్తవిక పరిస్థితులు ఏ పత్రికలూ, ఏ రేడియోలూ, చెప్పవు... తమ వ్యక్తిత్వాన్ని, తాము గుర్తించుకున్న ఏ ప్రజను ఏ ప్రభుత్వం బాని సలుగా చేస్తుంది!

పోషిన్ :- నిజంగా అంతే! అటువంటి ప్రజలను ఏ ప్రభుత్వం మాత్రం ఎలా హింసించగలుగుతుంది?మనవరకు మనం శక్తివంచనలేక, ప్రజల్లో ప్రచారంచేసి, వారిలో జ్ఞాన జ్యోతిని వెలిగించడానికి బద్ధకంకణులమయ్యాం — నే నిప్పుడు, యీ నిమిషాన్న,యిక్కడనుంచి, నా గ్రామా నికేవెళ్ళి నా గ్రామప్రజల్లో ముందుగా విప్లవజ్వాలలు రేపి నా కొనవూపిరియున్నంతవరకూ రక్తమాంసాలను ఖర్చుపెట్టి, ధన్యజీవినౌతాను ... జై బర్మా ...... "పదండి ముందుకు-పదండి తోసుకు ......"

అని పాడుతూ సంతోషముతో జయధ్వానాలతో సాగిపోతాడు. ఛిట్ టిన్ అదే పాటను అందుకుని తిరిగి తిరిగి పాడుతాడు.

— తెరపడుతుంది —

శ్రీ వేమన గ్రంథాలయము
జేలపోతవరం. (కృష్ణాజిల్లా.)

# మూడో అంకం
## (1-వ రంగం)

సాయంత్రం నాలుగు గంటల సమయం ... మొదటి అంకం, మొదటి రంగంలోని స్థలం. నిప్పులసెగవద్ద కూర్చుని, సుత్తెతో మేకులను గొడుతుంటాడు యూవాజా-అతని మిత్రుడు యూతిన్‌పా ఆయన ప్రక్కనే కూర్చుని మేకుల్ని ద్రావకంతో ముంచి వాటికి మెరుగుపెడుతుంటాడు. 50 సంవత్సరాల భారీమనిషి యూతిన్‌పా – చిరిగిన ఓ సిల్కు లుంగీ, బాగా మాసిన పొడుగుచేతుల వేస్టుకోటూ-రంగుపోయి నల్లగా కనిపించే ఇక్ష్వాకులనాటి ఫ్రేములోని అద్దాల కళ్ళజోడు, అతని శరీరాన్ని ఆక్రమించియుంటాయి.

యూతిన్‌పా :- (ద్రావకంలోనుంచి ఒక మేకును పైకితీస్తూ) యిటుచూడు యూవాజా...యీమేకు ఎంత కొత్తగా కనిపిస్తుందో-రెండంగుళాలు గల ఒక్క మేకును మనం రెండణాలకు అమ్మవచ్చు-అంతేలే-మెరుగులేని మేకు అణా, అదే మెరుగుపెట్టించుకుంటే రెండు అణాలకు చెల్లుబడి అవుతుంది. ఎక్కడైనా పాతయినుము సంపాయిద్దూ-శుభ్రంగా మేకులు తయారుచేద్దాం-

యూవాజా :- (చేతిలోనిపని ఆపి) పాడుబడ్డ ఇళ్ళల్లోనూ, కాలిపోయిన యిళ్ళల్లోను దొరుకుతుంది కావాల్సినంత యినుము. అంతేగాని, యిష్టమొచ్చిన చోటంతా,

ప్రతిశుంఠవద్దా, కొనటం మంచిదిగాదు. కొంతమంది పుణ్యాత్ములు మంచి యిళ్ళల్లోని వస్తువులను వూడ బెరికో, లేక నీటివంపులు లేవదీసో, ఒకటేమిటి అక్కడా యిక్కడా సంగ్రహించి మనకు ఏదో ధరకు అంటగడు తుంటారు. అందుకు ప్రాయశ్చిత్తంగా, దొంగతనం చేశామని లేని నేరంమోపి పోలీసుమామలు మనల్ని సన్మానించి తీసుకొనిపోతుంటారు స్టేషనికి.

యూతిన్‌పా :- అవునవును. మనం చాలా జాగ్రత్తలోనే యుండాలి. అటువంటి పరిస్థితుల్లో యీ జనమంతా మనల్ని ఏం చేయగలిగినా చేయతగుదురు. నే నీమధ్య, యీజపానువాళ్లుగూడా పాతయినుము ఇష్టంవచ్చినట్లు ఎగరేసుకుపోతున్నారని విన్నా-

యూవాజా :- (మరో మేకును తిన్నగా చూస్తూ) వాళ్లు చేయం దంటూ ఒకటుందా నాయనా? వెనుకటి ప్రభుత్వం ఎంత అవకతవకపనులు చేసినా, పాత యినుమును మాత్రం కదిలించలా-

యూతిన్‌పా :- వెనుకటిప్రభుత్వమే మంచిదిలేస్తూ-కాస్త ఒక ప్పుడు కాకపోయినా మరొకప్పుడు ఆదుకొనేది. వెనుక ప్రభుత్వపు ఉద్యోగులకు కాస్త మర్యాదంటూవుండేది- మిత్రమా-నేడో, నమ్మూ నమ్మకపో, ప్రతి జపాను ఆఫీసరు వెధవా, నిన్ను చెంపకుపెట్టికొడతాడు ... అలా ఆత్మను చంపుకున్నా కడుపుమంటల నార్పుకో టానికి చాలవా జీతాలు.

(యూటిల్ వాకా ప్రవేశం)

యూతిన్‌పా :- ఓహో! ఎంతసేపయింది వచ్చి? వేంచేయండి లోపలికి.

యూవాజా పనిఆపి అలాగే స్వాగతం పలుకుతాడు.

యూటిల్ వాకా :- (కుర్చీపై కూర్చుంటూ) మాతృశ్రీకి ఎలా వుంది?

యూవాజా :- జ్వరం తగ్గిందికాని, చాలా ఆరాటపడుతూంది-

యూతిన్‌పా :- ఆఁ! ఏమండి, యోగిగారూ! తిరిగి ఇంగ్లీషు వారి సైన్యాలు మన దేశంలోకి ప్రవేశిస్తాయని అనుకుంటున్నారూ? పశ్చిమ దేశాల్లో విజయాలు సాధిస్తున్నట్లుగూడా వింటున్నాం.

యూటిల్ వాకా :- (తలూపి లాభంలేదన్నట్లు) అందుకు నేనేమీ సంతోషించడం లేదు. ఇటు జపానువారుగాని, అటు ఇంగ్లీషువారుగాని విజయం సాధించడం నాకు సుతరామూ యిష్టంలేదు.

యూతిన్‌పా :- (మెరుగుపెట్టిన మేకును పెట్టెలోవేస్తూ) తమరేమైనా చెప్పండి, యీ జపాను తొత్తులకన్నా వెనుకటి ఇంగ్లీషువాళ్లు చాలానయం.

యూటిల్ వాకా :- తిరిగి ఇంగ్లీషువాళ్లుగనుక వచ్చినట్లయితే యధాప్రకారంగా మనం బానిసలవక తప్పదు.

యూతిన్‌పా :- మంచిదే! ఉత్తబానిసలవటంకన్నా, కడుపులోకి కాస్త అన్నం, కట్టుకోవడానికి కాస్త గుడ్డ గలిగిన బానిసలుగావటం మెరుగుగదూ! కష్టంబడ్డా ఫలితం!

యూటిల్ వాకా :- ఎప్పటికీ బానిసగా వుండటం నేను కోరను.

యూాతిన్‌పా :- అయితే యెలావుండాలని తమ అభిప్రాయం?

యూాటిల్‌వాకా :- అది చాలా తీవ్రంగా పరిశీలించాల్సిన విషయం. అనుకున్నంత త్వరగా తేలేసమస్యగాదు. ఈ యుద్ధం, యీా స్వాతంత్ర్యం, ఒకటేమిటి యీా రాజకీయాలన్నీ తారుమారవుతాయి. పాతకంటే కొత్తలో చెడుగు. ఆలోచిస్తే తల వగిలిపోవటంతప్పితే, చేసేదీ, తేలేదీ ఏమీాలేదు. నా మట్టుకు నేను, వీటికి వీలైనంత దూరంగావుండి, శుభ్రంగా ముక్కుమూాసుకుని తపస్సు చేసి నిర్యాణానికి ప్రయత్నిస్తాను.

బుజాన్నుంచి సంచి వ్రేలాడ వేసుకుని పోషిన్ ప్రవేశము

యూాటిల్‌వాకా ;- (సంతోషముతో) ఓహో! నువ్వా? రా నాయనా, రా!

యూావాజా :- (నిండు సంతోషముతో) ఎప్పుడొచ్చావు నాయనా?

పోషిన్ :- (చెప్పులు ఓ మూాలగా విడిచి) ఇప్పుడే నాన్నగారూ. (బౌద్ధసన్యాసికి నమస్కరించి) అమ్మా, చెల్లాయి;ఎలా వున్నారు నాన్నగారూ?

యూావాజా కొడుకేసి నిశ్శబ్దంగా, గంభీరంగా చూస్తాడు.

యూాటిల్‌వాకా :- కంటికి చూడ్డానికి బాగున్నావు సోదరా! మీాపార్టీ రాజకీయాలెలావున్నాయి?

పోషిన్ :- (తండ్రికేసి చూచి) నాకేం? నేను బాగావున్నాను. నాన్నగారూ! అమ్మ, చెల్లాయి, ఎలావున్నారు?

యూావాజా అప్పటికీ పలుకడు. యూాతిన్‌పా మేకులు లెక్కెడుతుంటాడు.

యూాటిల్‌వాకా :- యిక నీ ఉద్యోగాలు, అవ్వీ యెలా వున్నాయి?

పోషిన్ :- (చాలా ఆదుర్దాగా తండ్రికేసి నడిచి) నాన్నగారూ! చెప్పండి! చెల్లాయి ఎక్కడుంది? మాఅమ్మ ఎక్కడుంది?

యూవాజా :- (మెల్లిగాలేచి) లోపలికెళ్లు నాయనా! నువ్వే చూడు... నేను చెప్పలేను... మీచెల్లెలు ముఖంచెల్లక అభిమానంతో ఇల్లుగడలి బయటకు రావటంలేదు...

పోషిన్ :- అమ్మా! అమ్మా! (త్వరగా ఇంట్లోకిచొరబడుతాడు) లోపల్నుంచి దాసోమి—"నాయనా! నువ్వా? నువ్వేనా తండ్రీ! మాఅబ్బాయివి!" యూవాజా తసకొడుకును అనుసరిస్తూ లోపలికెళ్లుతాడు.

పోషిన్ :- (ఇంట్లోకి దూరుతూ) అవునమ్మా! నేనే! నీ కొడుకుని-పోషిన్‌ని-ఏం జరిగిందమ్మా?

యూవాజా బయటికొచ్చి, తిరిగి తనచోట్లో కూర్చుని మేకులు సరిచేస్తుంటాడు. యూతిన్‌పా తన పనిలో నిమగ్నుడౌతాడు. యూటిల్‌వాకా మోరపైకెత్తి ఆకాశంవంక చూస్తుంటాడు-ఒక్కక్షణం.

పోషిన్ :- (ఇంట్లోనుంచి) ఆ! అమ్మా! నీకీదుర్గతి ఎలా ప్రాప్తించిందమ్మా? కాని, నీ కొడుకులున్నారు! హు! (ఆమెను బుజాలపై యింట్లోంచి బయటకు తీసుకొస్తూ) ఎంతోకాలం సాగదు. మరింకెంతోకాలం సాగదు. నీ పగసాధిస్తాము. జపానువాళ్లను నిర్మూలంచేస్తాం - అమ్మా! నమ్ము!

యూవాజా :- (లేచి పోషిన్‌కు, దాసోమిని తీసుకురావటంలో

సాయం జేస్తాడు) ఒక్కసారికి నా ప్రాణంపోయినా కనీసం ఒక్క జపానువాడినైనా చంపలేనా అనిపిస్తుంది.

యూటిల్‌వాకా, తల్లి దాసోమికి, ఒకకుర్చీ సిద్ధంచేస్తాడు.

పోషిన్ :- (ఆమెను అందులో కూర్చోబెట్టి) అలా ఎప్పుడూ ప్రయత్నం చేయకండి నాన్నగారూ! మన పగసాధన ఒకకట్టుగా, ఒకతీరున నడవాలి - (పక్కనున్న బల్లపై కూర్చుని) ఆతరువాత, మనశక్తి సామార్థ్యాలను ప్రక్కనున్న బ్రిటీషు, అమెరికా, చైనాలాంటి సేనలతో సహకరించి, జోడించి వీళ్లపైకురకాలి.

యూతిన్‌పా :- (ముక్కుచివరి కళ్లజోడును పైకిత్రోసి) వాళ్లకు రోజులుదగ్గరకు వచ్చాయిలే! బ్రిటీషువాళ్లు రేపో, మాపోదిగి వెంటనే రాజ్యాన్ని ఆక్రమించుకుంటారు.

యూటిల్‌వాకా :- నేననుకుంటాను; యూతిన్‌పా! నీ మెడ కొంగలాగా ఆ బ్రిటీషువాళ్ల రాకకోసం చూచిచూచి నరంబెణుకుతుందేమో?

యూతిన్‌పా :- నాకవన్నీ అనవసరం! వాళ్లు చాలామంచి, పరిపాలకులు! నీ జపానువాళ్లుమాత్రం వట్టి శుంఠలు, వదరుబోతులు.

యూటిల్‌వాకా :- వాళ్లు నా జపానువాళ్లు ఏమాత్రంగాదు - నేనేం వాళ్లను పొగట్టంలేదు. అలాగని ఇంగ్లీషువాళ్ళని వెనకేసుకురాను. జపానువాళ్లు మన పరిపాలకులుగ వుండాలని నేనేమి ఎదురుచూట్టంలేదు. ఇంగ్లీషువాళ్ళ పునఃరాకకు ఎదురుపడిగాపులు గాయటంలేదు.

యూతిన్‌పా :- (కుంపట్లోని నిప్పును మరింతగా రాజేస్తూ) మంచిది-అయితే తమరేవైపు?

యూటిల్‌వాకా :- ఏవైపూ లేదు.

పోషిన్ :- ఏవైపూ వుండకుండా వుండటానికి వీల్లేదు. ఎవరు ఏవైపూ లేకుండా వున్నట్లయితే. బర్మాలో యుద్ధ మంటూ యెక్కడుంటుంది! ఫాసిస్టు సేనలు, మిత్రి రాజ్య సేనలు, యివే ముఖ్యాతిముఖ్యమైన రెండేరెండు పక్షాలు- ప్రపంచప్రజలంతా అటు ఆసైన్యంలోనో, యిటు యీ సైన్యంలోనో చేరిపోవాలి.

యూటిల్‌వాకా :- కాని, సోదరా! మిత్రిరాజ్య సేనలో చేరట మంటే, మనల్ని బానిసలుగ జేసిన ఆ యింగ్లీషువారినే తిరిగి వరించడమన్నమాట!

పోషిన్ :- క్షమించాలి! మీఉద్దేశ్యాలు స్వలాభంతో కూడు కున్నవి. మీరొక్క యింగ్లీషు వారినేగాక, మిగతా వారినికుండా మనస్సులో పెట్టుకోవాలి. మీవ్యక్తిగత మైన కోపతాపాలు కట్టిపెట్టి, మీవరకేగాక ప్రజకు ప్రిపంచ ప్రిజానీకానికి లోకకల్యాణానికి కృషిచేయడా నికి విశాలభావంతో తీవ్రింగా ఆలోచించాలి.

యూటిల్‌వాకా :- (తమ్మునికేసినవ్వి) ఎందుకని ? నీవిజ్ఞానాన్ని చాలా వృద్ధిచేశావు... చెప్పు... ఆపక, యింకఏమైనా వుపయోగకరమైన విషయాలుంటే చెప్పు.

పోషిన్ :- (ఉపన్యాసధోరణిలో రెండడుగులు ముందుకువచ్చి) అయితే వినండి. ఫాసిస్టులవైపున్నవి, దౌర్జన్యాలు, అనిష్టాలు, కుతంత్రాలు, భూస్వామికం, బలవంతంగా

పనిచేయించడం, బానిసత్వం మొదలైనవన్నీ నిలబడి యున్నాయి... ఇటుమిత్రరాజ్య సమితిలో ప్రజా సౌభాగ్యానికి పోరాడే రష్యావుంది - అందులో యింకా ధర్మంకోసం పోరాడే చైనా యున్నది. యూరపువాళ్లు స్వాతంత్ర్యప్రియులు... అమెరికా బ్రిటీషువాళ్లు ఇంటా బయటాకూడా పెట్టుబడిదారి విధానాన్ని నాశనం చేయడానికి శాయశక్తులా ప్రయత్నిస్తున్నారు. ఇవన్నీ గలసి మిత్రరాజ్యసమితిని సర్వాంగసుందరంగా భద్రంగా వుంచుతున్నాయి ... ఇందులో అబద్ధంలేదు. మనం ఆచరించాల్సినవిషయాలు అన్నీ ఇందులోవున్నాయి...

యూటిల్ వాకా :- (నవ్వుతూ) అవును. ఆవిషయాల్ని, వారి ఆశయాల్ని నేను పూర్తిగా అంగీకరిస్తాను. బుద్ధమహాశయుడుగూడా అవే విషయాల్ని బోధించాడు - కాని, నువ్వు, చెప్పిన విషయాలను మిత్రరాజ్యాలు పాటించడంలేదేమోనని నా సందేహం! బర్మాకు స్వాతంత్ర్యం యిస్తామని బ్రిటీషువాళ్లు ఎప్పుడన్నామాట సామెత కన్నా అన్నారా? ఇండియాకు స్వాతంత్ర్యం యిస్తామని యింతవరకేమిచ్చారు? ఆ పెట్టుబడిదారీ విధానం వాళ్లల్లో యింకా బలంగావుంది.

పోషిన్ :- (కూర్చున్నవాడల్లా లేచి) ఇండియాను, బర్మాను దృష్టిలో పెట్టుకుని, తమరు మాట్లాడకండి. ప్రపంచాని కేసి చూడండి... ప్రతికోణంనుంచి జాగ్రత్తగా పరిశీలించండి... యూరపు ఖండంలోని ఆర్థిక, రాజకీయ, సైనిక, ప్రతి విషయాల్ని గమనించండి... రష్యాలో,

అమెరికాతో, బ్రిటనుతో పోల్చి చూడండి... ఉదయిస్తున్న సూర్యుడిలా పైకిప్పుడే వస్తూన్న ప్రజా సహజ శక్తుల్ని అడ్డుపరుస్తున్న యీదోపిడి దొంగల ముఠాలు చిత్తవటం చూడటంలేదా?

దాసోమి :- (బిగ్గరగా సంతోషంతో) దీవిస్తున్నాను నాయనా! దీవిస్తున్నాను నిన్ను !

యూవాజా :- (యూతిన్‌పా వైపుకుచూచి నవ్వి) నువ్వా దీవించు మా అబ్బాయిని! వాడ్ని దీవించు!

యూతిన్‌పా :- (నిప్పు వూదుతూ) మంచిది! చాలా మంచిది! తెలివైనవాడు. తప్పక జయం కలుగుతుంది.

యూటిల్‌వాకా :- (నవ్వుతూసోదరునివైపుకుచూచి) నాయనా, తమ్ముడూ! ఎంతమాటకారి వయ్యావు? చాలా తెలివైన వాడివయ్యావు!

పోషిన్ :- (నిప్పుదగ్గరకెళ్ళి, అలుముకున్న పొగను చెదరగొట్టి) మేము అంటే మా పార్టీవాళ్ళం, మనలో అలుముకున్న పాతపంథాలను, మూర్ఖాభిప్రాయాలను పొగల్ని మాయంచేసినట్లు చేసి, విప్లవజ్వాలలు, అభ్యుదయ పంథాలను అలవరుచుతాం. అటువంటిరోజులు త్వరలో వస్తాయి. పొగలాంటి యీ మూఢనమ్మకాలు వదలిపోతేనేగాని, నిప్పువంటి భవిష్యత్తుగనిపించదు. అందుకు మేము ప్రజల్ని వేడుకుంటున్నాం. సూర్యుడు ప్రకాశించి కమ్మినమంచును చెదరగొట్టినప్పుడే, ఆ అరుణకాంతుల్లో ప్రకృతి శోభాయమానంగా ప్రకాశిస్తుంది ... అంతవరకూ మనకు కళ్ళున్నా ఒకటే లేకపోయినా

ఒకటే. కాని అగ్నిజ్వాలలను ఎంతో కాలం యీ మంచు పొగలు దాచిఉంచలేవుగదా? పాతలనుచూస్తూ, కొత్త కోసం నిరాశచెందం... సంధికి కల్లోలం ప్రధానం-ఆ తరువాత ఉజ్జ్వల భవిష్యత్తు: ఆ ఉజ్జ్వల భవిష్యత్తుకు అందరమూ నిస్పృహ, నిరాశలను అవతలకుద్రొక్కి-అశ్రులుచూస్తూ కూర్చోవాలి. అట్టిరోజులు రాకపోవు. త్వరలోనే వస్తాయి. ప్రజల్లో సంచలనంకలిగి, జ్వాలలు రేగక మానవు, వారిహృదయాల్లో, వృద్ధి, వికాసం, సర్వమానవ సౌభ్రాతృత్వం, మనస్సుకు దృఢత్వం, సంఘబలం అన్నీ నాటుకుపోగలవు. నిజం! ఇది నిజం! రోజుకు రోజుకు ప్రజల్లో సంచలనం, ఐకమత్యం నేర్చుకుంటున్నారు! విజయం మనదే!

యూతిన్‌పా :- (లేచి) మంచిది - యూవాజా! కుంపటిమీద పాత్ర పెట్టు- పొట్టకు కాస్త అదీ యిదీ తేస్తా!-

యూవాజా పాత్రి పొయ్యిమీద పెట్టి, నీళ్లు పోస్తాడందులో.

యూటిల్‌వాకా :- (నిమ్మళంగా కుర్చీలోంచి లేచి, తమ్ముని సమీపించి, అతని బుజంపై చేయివేసి గంభీరంగా) తమ్ముడూ! నువ్వుచెప్పిందంతా ధర్మబద్ధంగానేయున్నది. నీవు చెప్పేమార్గంలో పయనించడానికి నాకభ్యంతరం లేదు. ఆమార్గాన్న పయనించడం నీ నా అభిమతం గాదు, ప్రతి భాద్ధమతస్తుడూ, ప్రతి బర్మాబిడ్డడు పయనించాల్సి వుంది. కాని ఒక్కవిషయం-నావల్ల నీకొకావలసిన ప్రయోజనం, ఏమన్నావుంటే చెప్పు, వెంటనే, యిప్పుడే, యీక్షణాన్నే సిద్ధంగా వున్నాను.

పోషిన్ తన సోదరునికేసి సంతోషంగా మెరుస్తూ చూస్తాడు-వినయ విధేయతలతో అతని కాళ్ళపైబడతాడు...

— తెరపడుతుంది —

## (2-వ రంగం)

సాయంసమయం, అయిదారు గంటలమధ్య, మొదటి అంకం, రెండవ రంగపు స్థలం-

ఒక జపాను ఆఫీసరు వెనుకటి రంగంలో చూచినవాడే చైర్‌లో కాళ్లు బారజాపుకుని, సిగరెట్ కాలుస్తుంటాడు... చిన్న డ్రాయరు, బనీను, తొడుక్కుని వుంటాడు. ఆయన ప్రక్క కుర్చీలో మరొక జపాను ఆఫీసరు యూనిఫారంతో యుంటాడు.

రెండవ జపాను ఆఫీసరు :- మనం యీ బర్మావాళ్లను లొంగ దీసుకోవడానికి సరైన మార్గాలుపయోగించడం లేదు. వాళ్లు మనకు చచ్చినాసరే సాయంచేయకపోతున్నా రంటే అందుకు మనం ఆశ్చర్యమేమీ పడనక్కరలేదు. మన మొట్టమొదటి ప్లానుప్రకారం, బర్మావాళ్లల్లో దేశ భక్తి గొల్పి, అమెరికావాళ్లమీద ఇంగ్లీషువాళ్ళమీద కొండాలుచెప్పి కొంతవరకు స్వాతంత్ర్యం ఇచ్చినట్లు కన బరచి, అప్పుడు "ఇదిగోమీదేశం మీకర్పిస్తున్నాం-మా చేయదగిన సాయంతో మీదేశాన్ని మీరు చూచు కోండి. ఆ వెంగళప్పలు మీదగ్గరినుంచి మీదేశాన్ని కాజేయాలనుకుంటున్నారు." అని చెప్పితే పరిస్థితులు యిలా మారికపోవు. అప్పుడు వాళ్లు మనకు హృదయ పూర్వకంగా సాయంజేసేవారు. అంతెందుకు కోరినవన్నీ

తెచ్చేవారు... యిప్పుడో, మనం వారిలో ఐక్యత లేకుండా జేస్తున్నాము. వెధవ కీచులాటలు రేపి, కూడిక చంపేసి దేశభక్తిని వాళ్లనుంచి తుడిచేస్తున్నాం. వాళ్లం దరిపైనా మనం వుంచిన వేగులవాళ్లకు లెక్కలేదు. పైగా, వాళ్లకు మనకూ మధ్యనున్న అనుమానాలను పెంచుకుంటున్నాం.

మొ॥ జపాను ఆఫీసరు :- ఆఁ! ఆఁ! అవును హాటా! నీవుచెప్పిన ప్రతిమాట, నీ బుర్రలోనుంచి వచ్చిన ప్రతిభావన, వెనుక నువ్వు యూనివర్సిటీలో చదువుకున్న చదువుకు విరుద్ధంగా, విషతుల్యంగా యున్నాయి. వాళ్ళల్లో గనుక కట్టునువిర్పరిస్తే అదితిరిగి మేకై మనకెదురు తిరుగు తుందని నీ బుర్ర ఊహించలేకపోయింది. మనం యీ దేశభక్తుల్ని, స్వాతంత్ర్య పిపాసుల్ని ఎలా నమ్మటం? మనం ముఖ్యంగా యిలా యెందుకు యుద్ధం చేస్తు న్నామో గుర్తించుకో! మనం పోట్లాడేది రాజ్యం కోసరం- రాజ్యపరిపాలనకోసం- ఆ విషయం వీళ్ళకు తెలుసు-మనం వాళ్ళ కావిషయం తెలియదనుకోవడం మన బుద్ధితక్కువ. ఇంతమంది వేగులవాళ్ళను నియ మించిందెందుకు ? అందుకోసమే! వాళ్ళ భావాలు తెలుసుకోవడానికే!

హాటా :- కాదు! అల్లాపీల్లేదు. మనం యీ ప్రజల మంచి చెడ్డల్ని విచారించి వారికి సేవచేయడం మనవిధి-ఇంట్లో తండ్రి కుమారుని యోగక్షేమాల్ని తెలుసుకున్నట్లు ప్రజల్ని పరిపాలించి, వాళ్ళకు వలసినన్ని సదుపా

యాలు, రాకపోకలకు రైళ్లు మొదలైన వాహనాలు, వర్తక వ్యాపారాలుపోషించడం, రైతులకు వ్యవసాయ సదుపాయాలు యివన్నీ మనం వాళ్ళకు చూడటం మన విధి.

మొదటి ఆఫీసరు :- పిచ్చివాడా ! ఇవ్వి నువ్వూహించినంత సులభసాధ్యాలుగావు. పైగా మన అధికార్లు మన తిండీ, గుడ్డా, ఇల్లు, అంతా యిక్కడే,మన మాక్రమించుకున్న దేశాల్లోనే చూచుకోమని చెప్పలా? అమెరికావాళ్ళకు మల్లే మనకు బీడీముక్కదగ్గర్నుంచి యిళ్ళనుండీ రావు. ఆఖరికి వాళ్లు సారా, సిగరెట్లుగూడా అమెరికానుంచి తెప్పించుకుంటున్నారు. మనమేమో యీదేశాలలో నుంచే మనకావలసినవన్నీ సేకరించుకుంటున్నాం - పసిపిల్లలదగ్గరినుంచి తండ్రిగాని, తల్లిగాని, లేక పెద్దన్న గాని కావల్సిన వస్తువులన్నీ ఊడబెరుక్కోవడం ఎక్కడన్నా నీ జీవితంలో చూచావా? అందువల్ల తండ్రి ల్లాగా, పెద్దన్నల్లాగా మన మీా పరిస్థితులలో వుండ గలమా? (తెరలోపల్నుంచి యూటిన్‌పా అరుపులు విని పిస్తాయి. మొదట ఆఫీసరు వింటాడు) ఏమిటది?

హాటా :- (శబ్దం ఎటువైపునుంచి వస్తుందో శాస్త్ర పరిశీలనగా చెవియొగ్గి) అది మరొక ఎరెస్టు అయివుంటుందిలే!

యూటిన్‌పా యిద్దరు జపానుపోలీసులు ప్రవేశము-మరొక బర్మావాడు అతను గూడా యుంటాడు. బాగా త్రాగియుండటంవల్ల కళ్లెర్రపడ్డాయి ముఖం కంది యుంది. సరిగ్గా నిలబడలేకపోతున్నారు — పొట్టిచేతుల చొక్కా నేతలుంగీ - వాళ్ళంతా ద్వారంముందు నిలుచున్నారు.

మొదటి ఆఫీసరు :- (చప్పునలేచి నిల్చోని) ఏమిటి పోటోన్?
యీసారి ఎవర్ని పట్టుకవచ్చావు?

పోటోన్ :- (కొద్దిగా ముందుకు జరిగి) యిదిగో! యీ మహాను
బాహుడు, ఒకప్పుడు ఇంగ్లీషువారి హయాములో గవ
ర్నమెంటు ఉద్యోగం చేశాడు. వాళ్లంటే తగని అభి
మానం! వారి పునఃరాకకోసం కలలుగంటున్నాడు.
ఇవాళవీడు ''యూవాజా'' యింట్లోవున్నాడు...అక్క
డకూర్చుని చాలాసేపు మాట్లాడాడు.

మొదటి ఆఫీసరు :- ఆ 'యూవాజా' ఎవరు?

పోటోన్ :- వాడా? తమకు తెలుసు... ఒకప్పుడు వాడి
కూతురు చెరచబడింది.

మొదటి ఆఫీసరు :- ఓహో! తెలిసింది-వాడా! సరే అయితే
తర్వాత ?

పోటోన్ :- పట్నంనుంచి యూవాజా కొడుకు తిరిగొచ్చాడు.
వాడు వీడు అంతా చాలాసేపు మాట్లాడుకున్నారు.
మనం యిప్పుడు వీడిద్వారా తెలుసుకోవాల్సి వుంది.
వాడెందుకిక్కడికొచ్చాడు? వాళ్లంతాతీవ్రంగా మాట్లా
డుకున్న మాటల సారాంశమేమిటి? అని.

మొదటి ఆఫీసరు :- హోటా! విషయం ఏమిటోకనుక్కో! (తిరి
గొచ్చి కుర్చీలో కూలబడుతాడు)

హోటా :- (యూతిన్‌పాతో) అయితే-ఆపట్నంనుంచి తిరిగొచ్చిన
వాడితో అంత దీర్ఘంగా మాట్లాడింది ఏమిటి? అతను
ఏమేం చెప్పాడు?

యూాతిన్‌పా :- అతనేమీా చెప్పలేదండీ!

హాటా :- "అతను ఏమీా చెప్పలేదండీ అని" ఎలా చెప్పగలుగుతున్నావు? వాడు నీతో అంతదీర్ఘంగా మాట్లాడినప్పుడు.

యూాతిన్‌పా :- (భయపడుతూ) చెప్పాడండి చెప్పాడు-అక్కడ పట్టణాల్లో ఏలా ఎంతమంచి తిండి దొరకుతుందో, ఆపట్టణాలు ఎంత బాగుంటాయో-

హాటా :- వాడు మాగురించిగాని, రాజకీయాలుగాని, యుద్ధ విషయాలుగాని, ఏమీా చెప్పలేదని నిరూపించగలవా?

యూాతిన్‌పా :- (వణుకుతూ, నత్తిగా) అబ్బే! లే...లే...లేదండి! ఆ విషయాలు ఏమీా చె... చె... చెప్పలేదండి.

హాటా :- అయితే యుద్ధకాలంలో ప్రజలు యుద్ధంగురించి మాట్లాడుకోరనేనా నీ యుద్దేశ్యం?

యూాతిన్‌పా :- (కాదన్నట్లుగా తలూపుతూ) కా... కా... కాదండి... మేమలా మాట్లాడుకోలేదండి.

మొదటి ఆఫీసరు :- అరేయ్! వాడ్ని పట్టుక విరగతన్నండి-అదొక్కటేమార్గం: (ఒక సైనికుడు కొరడా ఒకటి తెస్తాడు. యూాతిన్‌పా యింకా భయభ్రాంతుడౌతాడు.) చూస్తావేం? ఊ! సత్కరించు... (సైనికుడు యూాతిన్‌పాను గట్టిగా బాదుతాడు. యూాతిన్‌పా బిగ్గరిగా అరుస్తూ యేడుస్తాడు.)

హాటా :-(కుర్చీలోంచి లేచివచ్చి యూాతిన్‌పాతో) చెప్పు! బస్తీలోంచి వచ్చిన ఆ వెధవ ఏంచెప్పాడో, మాతో చెప్పు!

యూాతిన్‌పా :- (ఏడుస్తూ) నేను నిజమే చెప్పాను అంతకుమించి అతనేమీా చెప్పలేదు.

హోటా :- నాకు నమ్మకంలేదు. (సైనికుడు యూతిన్‌పాను తిరిగి వకటి తగిలిస్తాడు. మరో రెండు... యూతిన్‌పా బాధతో దెబ్బలు తగిలినచోట తడుముకుంటాడు...) చెప్పు! యిప్పటికైనాచెప్పు! వాడేం చెప్పాడు.

యూతిన్‌పా :- (వణుకుతూ హోటావైపుకు చూచి, తలదించు కుంటాడు... ఒక్కక్షణం...) నిజం! అతనేమీ చెప్ప లేదండి.

హోటా :- (క్రోధంతో బూటు కాలుతో నేలను బలంగా తన్ని) ఏమిటీ పందిలా వాగుతున్నావ్? యీరోజుల్లో, మీ బర్మావాళ్లు, మా జపానువాళ్లను గురించి, యుద్ధాన్ని గురించి మాట్లాడుకోవడం లేదంటే యెవరన్నా నమ్ము తారా? చూస్తావేం! కానివ్వండి. యింకా గట్టిగా మోతాదుగానివ్వండి (సిపాయి యూతిన్‌పాను మరింత గట్టిగా మరోమూడు తగిలిస్తాడు)

యూతిన్‌పా :- (దెబ్బ దెబ్బకు బిగ్గరిగా ఏడుస్తాడు. నాలుగో దెబ్బ పడబోయే సమయానికి) చాలండీచాలు! మీరాక్కా వలసిందంతా చెప్పుతా! అంతా చెపుతా!

హోటా :- (చాలా బిగ్గరిగా) ధూత్ తెరే! ఆగండిరా! మొద టనే చెప్పలేక పొయ్యావురా దెయ్యం! మూర్ఖుడా! సరేచెప్పు! వాడేంచెప్పాడు.

యూతిన్‌పా :- (వణుకుతూ, కళ్లంట నీరుకారుస్తూ, తలవంచు కుని డగ్గుత్తికతో) అతను అతను చెప్పాడు. ఏమంటే మిత్రరాజ్యసమితి సేనలు గెలిచి తీరుతాయట!

హోటా :- (బిగ్గరిగా) చెప్పాడు! చెప్పాడుగా! అయితే మిత్ర

రాజ్యసమితి సేనలు గెలిస్తే. ఆ తర్వాత బర్మాగతి ఏమవుతుందోగూడా చెప్పాడా?

యూతిన్‌పా లేదని చెప్తాడు.

హాటా :- (బలంగా అడుగు ముందుకేసి) చెప్పా... యింకా ఏంచెప్పాడు... యింకా బిస్కత్తులు కావాలా? యింత కంటే మంచిరకపు తియ్యని.

యూతిన్‌పా :- (దీనంగా హాటావైపుకు జూస్తూ) మిత్రరాజ్యాలసైన్యం గనుక గెలిస్తే బర్మాకు స్వాతంత్ర్యం లభిస్తుందన్నాడు.-

హాటా :- (తిరిగి కోపంతో) ఏమిటీ! మిత్రరాజ్యాల సేనలు గెలిస్తే బర్మాకు స్వాతంత్ర్యం వస్తుందని నమ్మే పశువులు యీ బర్మాలో వున్నాయా? అసలు ఆ పశువులకి మెదడంటూ వుందా? థూత్ తిరీ ఆ ఆంగ్లో అమెరికన్లు మిమ్మల్నెలా చూచేవారో గుర్తుందా? మేము మీకెప్పుడూ స్వాతంత్ర్యం యివ్వాలా? కనీసం యిటువంటి స్వాతంత్ర్యమన్నా యిస్తామని ఆ వెధవ తొత్తులు మాట కన్నా అన్నారా? నీ బ్రతుకుచెడా! ఎటువంటి తెలివి తక్కువ దద్దమ్మలయ్యా మీబర్మావాళ్లూ!

మొదటి ఆఫీసరు :- హాహాహాహా! మీ యూనివర్సిటీలు మీకంతవరకే నేర్పాయి! అసలు వాస్తవిక పరిస్థితులు వేరు! అంతేగదూ! హాహాహాహా!

హాటా :- (కోపాన్ని అణచుకొని, వినయంగా చేతులుమడిచి) అయితే ఇంతకీ వెధవ ఏయిస్టూ? బహుశాకమ్యూనిస్టా?

యూాతిన్‌షా :- (నిబ్బరంగా) నా కా విషయాలను గురించి ఏమీా తెలియదండీ -

హాటా :- తెలియకపోవడమేమిటి? తెలుసుండాలి.

యూాతిన్‌షా :- నాకు నిజంగా తెలియదండీ! ఆపైన తమదయ!

హాటా! యీా గాడిదను కోదండం తీయండిరా! అప్పటికీ జవాబు చెప్పకపోతే అప్పుడు చూద్దాం. (మొదటి ఆఫీసరుతో) యీా విషయం ఆ యింటిల్లిపాదినీ అరెస్టు చేస్తేగాని తేలదనుకుంటాను.

మొదటి ఆఫీసరు :- (విలాసంగా యాలవేసుకుంటూా గుడ్డలు తొడుక్కొని .. నెత్తిన టోపీ పెట్టుకుంటాడు) ఏయ్! మీాలో ఐదుగురు సిద్ధంగాయుండాలి.

హాటా రైఫుల్‌ను బెల్టుకేసులోకి త్రోసి, కత్తిచేతిలోకి తీసుకుంటాడు. ఒక సైనికుడు యూాతిన్‌షాను తన్ని కిందకుతోస్తాడు, వాళ్లంతా ఆయన్ను తాళ్ళతో గట్టివేస్తారు. తనేపాపము ఎరుగనని ఏడుస్తాడు.

యూాతిన్‌షా :- నా కా విషయాలను గురించి ఏమీా తెలియదు! ఏ పాపమూా ఎరుగను - నన్ను పోనివ్వండి - దయచూాపండి. నన్నొదలండిబాబు! వదలండి. (హాటాన్ అతనివంక జాలిగా చూాస్తాడు.)

— తెర —

# (3-వ రంగం)

సూర్యాస్తసమయం. మొదటి అంకం. మొదటి రంగపు స్థలం—

నిప్పులకుంపటిలో, నీళ్లు సలసల మరుగుతుంటాయి. పోషిన్, యూవాజా బెంచీపై కూర్చునియుంటారు. దాసోమి కుర్చీలో కూర్చుని యుంటుంది. యూటిల్ వాకా మరొక కుర్చీలో కూర్చునివుంటాడు. వారందరూ ఆలోచనా నిమగ్నులై యుంటారు.

పోషిన్ :- (వళ్ళు విరుచుకుంటూ) అదే మంచిపని. (యింటి వైపుకు చూచి) చెల్లాయ్! టిన్‌మే ఇంట్లోవున్నావా? (ఇంట్లోనుంచి 'టిన్‌మే' గొంతుక) ఏమిటన్నాయ్? వంటయిందా? నాకు చాలా ఆకలిగా ఉంది. (తిరిగి లోపల్నుంచి) ఆ! పూర్తి అయినట్లే! రెండునిమిషాలు! (బయటి తోటలోనుంచి ఒకపిల్లవాడి గొంతుక) 'ఏమండోయ్! ఏమండోయ్! కొంపమునిగింది'.

యూటల్ వాకా:- (లేచి) తోట్లోంచి ఎవరోకుఱ్ఱాడు అరుస్తూన్నట్లున్నాడు.

ఆతురతగా 12 సంవత్సరాల కుఱ్ఱాడి ప్రవేశం. మొలకు మాత్రం ఒక మాసినలాగు: పరుగెత్తటం వల్ల రొప్పుతుంటాడు.

యూటిల్ వాకా :- ఏమిటి సిన్‌బాన్! ఏమిటి విశేషం?

సిన్‌బాన్ :- (సన్యాసి దగ్గరకువచ్చి ఆయన పాదాలవద్ద వాలి) జపానువాళ్లు :సూతిన్‌పాను యిక్కడినుంచి వెళ్లంగనే పట్టుకున్నారండీ! (పోషిన్ నిటారుగ కూర్చుంటాడు)

యూటిల్ వాకా:- ఆయనిప్పు డెక్కడున్నాడు?

సిన్‌బాన్ :- (వణుకుతూ) బౌద్ధస్థూపంలో యున్నారు.

పోషిన్ :- అయితే జపానువాళ్ళు ఆయన్నేం చేస్తారు.

సిన్‌బాన్ :- ఏవేవో అడుగుతున్నారండీ?

పోషిన్ :- వాళ్ళేం అడిగారో నీకు తెలుసా!

సిన్‌బాన్ :- తెలియదు. వాళ్ళాయన్నేమడిగారో నాకేమీ తెలియదు.

పోషిన్ :- ఏవిధంగానూ మనమిక్కడ వుండటం మంచిదిగాదు.

యూటిల్‌వాకా :- ఎందువల్ల?

పోషిన్ :- వాళ్ళిక్కడకు తప్పకుండా వస్తారని నాగట్టి నమ్మకం- వాళ్ళసలే అనుమానపు మనుష్యులు! వాళ్ళు ఏకొద్ది విషయమో ఆయన దగ్గరనుంచి లాగివుంటారు. తరువాత మనం వాళ్ళకు చిక్కామంటే చాలా అవస్థ పడతాం-

యూటిల్‌వాకా :- (లేస్తూ) అయితే సరే! మన మిప్పుడేం చేయాలిక్కడ? ఇదుగో సిన్‌బాన్ వెళ్ళి ఆ జపానువాళ్ళు వస్తున్నారేమో చూడు.

సిన్‌బాన్ :- ఆలాగే! (బయటకు పరుగెత్తుతాడు)

పోషిన్ :- ప్రస్తుతాశయం- ప్రజల్లో సంచలనము కలిగించి, వారికి ఐక్యతనేర్పి కూడగట్టుకొనడం- మనం ఆయుధాలతో ఎదుర్కొనడానికిది సమయంగాదు. కాని ఆయుధాలు ముందుగనే తయారులోవుంచుకోవటం మంచిది. వాళ్లకు మనం చిక్కకూడదు. చిక్కామంటే చచ్చామన్నమాటే!

యూటిల్‌వాకా :- అయితే మనం ఎక్కడికిపోయేటట్లు?

పోషిన్ :- ఏదైనా మరో పల్లెకుపోవడమో, మారువేషాల్లో మసలటమో, లేదా అడవుల పాలవ్వటమో. తరువాత

సంగతెల్లావున్నా, ముందు యిక్కడినుంచి వెంటనే మకాం ఎత్తివెయ్యాలి.

యూటిల్ వాకా :- 'యూ అ తా పా' వూరు మంచి ప్రదేశం! అతను నాకు చాలా స్నేహపాత్రుడు. పోనీ మనం అక్కడకే పోదాం.

పోషిన్ :- నీ దగ్గర ఏమైనా ఆయుధా లున్నాయా?

యూటిల్ వాకా :- నాదగ్గర కావలసినన్ని చేతిబాంబులున్నాయి. అవన్నీ బ్రిటీషువాళ్లు యిక్కడనుంచి పోయినపుడు సేకరించినవే- నేను వాటిని మనం పోయేచోట దాచి పెట్టాను.

పోషిన్ :- చాలాగొప్ప శుభవార్త! ఒక్క చేతిబాంబు 20మంది జపానువాళ్ళను మట్టుపెడుతుంది. వారిదగ్గిరినుంచి 20 రైఫిల్సు సులభంగా లాగవచ్చు.

యూవాజా :- (లేచి నిలుచుని) నాదగ్గరా, రైఫిలుంది. నేను దాన్ని బ్రిటీషువాళ్ళు యిక్కడనుంచి పోతున్నప్పుడూ పారిపోతున్న ఒక హిందూసైనికుడి దగ్గర కొన్నా 25రూపాయిలు యిచ్చి- అదియిటువంటి సమయాల్లో బాగా పనికొస్తుంది. దాన్ని "క్యాక్ మీాటిక్" లో దాచి యుంచాను.

పోషిన్ :- (సంతోషంతో) చాలామంచిది నాన్నగారూ! వాటితో మనం యీ కొద్దిమంది జపానువాళ్ళను ఎదుర్కోగలం! యీ జిల్లాకంతటికీ వాళ్ళ జనభా వెయ్యి! మన బర్మావాళ్ళో నూరువేలమంది! మనం ఆ నూరువేలమందిని కూడగట్ట గలిగినట్లయితే, కొండవళ్ళా,

గోడ్డళ్ళూ, తీసుకుని. ఆ జపాను వెధవల్ని, ముక్కల
క్రింద నరికేయవచ్చు.

యూటిల్‌వాకా :- అయితే త్వరగా పదండి!

పోషిన్ :- రామ్మా చెల్లాయి! యింట్లోంచి బయటకురామ్మా!
మనమంతా కలిసి, ఆ జపానువాళ్ళపై కసిదీర్చు
కుందాం. సిగ్గుపడాల్సిన పనిలేదమ్మా! వారి దుర్మా
ర్గాన్ని ప్రపంచానికి చాటుదాం- నీ తల్లిదండ్రులకు, సోద
రులకు, ప్రపంచానికీ, మన బర్మాస్త్రీలు ఎటువంటి
అవమానాల్ని భరించారో చాటు తల్లీ!

టిన్‌మే :- ఇదుగో వస్తున్నా అన్నా - తప్పకవస్తా!

పోషిన్ :- (దీనంగా తండ్రికేసి చూచి) మీరు యిక్కడేవుంటే
మంచిది నాన్నగారూ! అమ్మగార్ని ఓ కంట కనిపెట్టి
చూస్తుండండి. కొంచెం కుదిరికయిన తర్వాత నే నొచ్చి
మిమ్మల్ని తీసుకవెళుతాను.

యూవాజా :- (బరువు గుండెతో) మీ పవిత్ర కర్తవ్యంలో
పాల్గొనటానికి నా కవకాశంలేకపోవడం నా పాపం!

దాసోమి :- (అతిస్పష్టమైన గొంతుకతో) ఏమండోయ్! మనం
నలుబై సంవత్సరాలు కాపురంచేశాం. ఈనాడు మీరు
నన్ను విడిచిపోతానంటే నాకేదో యిదిగావుంది. కాని,
నా క్షేమంకోరి, మీ పిల్లలతోపాటు మీరు వెళ్ళక
పోవడం మీరు ఓ పెద్ద అపరాధంచేస్తున్నట్లు. నన్ను
ఉద్ధరించడంకోసం వెళ్ళటంలేదు. నీ కూతురిని అవమా
నించిన ఆ జపానుతొత్తులమీద కసిదీర్చుకోవడం మీ



శ్రీ వేమన గ్రంథాలయము
తేలప్రోలు. (కృష్ణా జిల్లా.)

కనీసధర్మం! నీ కొడుకులతోబాటు, నీవుగూడా వాళ్లను చంపి ముక్కలుచేయడం విద్యుక్తధర్మం-

యూవాజా తనభార్యగూడా తన్ను పొమ్మంటున్నందుకు సంతోషించి త్వరత్వరగా యింట్లోకి వెళుతాడు-

యూటిల్‌వాకా :- (దుఃఖంతో) మాతృశ్రీ! త్వరలో నీ పోషణకోసం అక్కడినుంచి కొంతమంది పిల్లల్ని పంపుతాను.

పోషిన్ :- (తల్లి పాదాలకు నమస్కరించి) మేము వెళ్లుతున్నామమ్మా! పూర్వం వీరులు రణరంగంలోకి వెళుతూ శుభసూచకంగా తల్లి చీరకొంగులో చిన్న గుడ్డపీలిక చించుకొనే వారట! అలాగే మేము నీ మాటలు స్వీకరించి, ఆదర్శం చేసుకుని, స్వాతంత్ర్య సమర రంగంలోకి దూకుతున్నాం జై బర్మా-

దాసోమి :- క్షేమంగా వెళ్ళి. లాభంగా రండి నాయనా! మీాకే కష్టలూ రాకుండుగాక!

పోషిన్ :- (అన్న దగ్గరకు వెళ్ళి) యాభై సంవత్సరాల పూర్వపుపరిస్థితీ యింతే! అప్పుడు బర్మావాళ్ళంతా ఒకటై ఇంగ్లీషువారిని ఎదుర్కొన్నారు. ఆ నాడు దేశమంతా ఎగుడు దిగుడుగా నడిచింది. అయితే ఆ నాడు బ్రిటీషువారికి క్రమంగా బర్మావాళ్లు తలవంచడం జరిగింది. అప్పటికవి వాళ్ళకు చివరిరోజులు! క్రమంగా పద్ధతులన్నీ మారాయి! పెట్టుబడి దారీవిధానం ఎర్పడింది. యిప్పుడీ యుద్ధం దేశం మొత్తాన్ని ఊపేస్తుంది. వాడ వాడ పల్లె పల్లె ప్రాకుతుంది. యుద్ధసమాప్తి అంటే యాభై సంవత్సరాలనాడు జరిగినట్లే చరిత్రలో గొప్ప

మార్పులు రావడ మన్నమాట! మార్పులు తప్పవు-కాని- యిప్పుడు మనబర్మా ప్రజలకు, మనకు మనమే పరిపాలించుకొను రోజులు, స్వాతంత్ర్యమూ, స్వేచ్ఛా, వస్తాయి, తప్పదు!

యూటిల్ వాకా :- (రంగానికి ఎడమవైపుగా మెల్లిగా నడుస్తాడు) అన్నీ జరుగుతాయి! మనరాజ్యం, మన ప్రజా రాజ్యం, మనకు సిద్ధిస్తుంది.

పోషిన్ :- (యింటివైపుకు దిరిగి) రండి నాన్నగారూ! చెల్లాయ్. త్వరగా రావాలి. కాలం మనకోసం ఆగదు.

యూవాజా ఒక చేతిలో పొడవుపాటి కత్తి మరొకచేతిలో బాణము, విల్లంబులు తీసుకుని బయటికి వస్తాడు. టిన్ మే ఒకచేతిలో బల్లెం, నెత్తిమీద గంప పెట్టుకొని యూవాజాను అనుసరిస్తుంది.

యూవాజా :- (పొడవుపాటికత్తి పోషిన్‌చేతి కందిస్తూ) ఆ ఆయుధాలన్నీ నీ చేతికందేవరకూ ముందుగా దీన్ని దగ్గరవుంచుకో! పదహారు దమ్మిడీలు బొత్తిగాపెట్టి నరికితే సరిగ్గా ఏటుకు రెండు భాగాలై కూచుంటాయి. చాలా పదునుగావుందిలే!

పోషిన్ :- (కత్తి చేతిలోకితీసుకుని టిన్‌మే వైపుకు దిరిగి) నీ నెత్తిమీద గంప ఏమిటి చెల్లీ?

టిన్ మే :- వంటపాత్రలన్నా య్! ఇంకా - ఏవో లే రైలుదోవ ప్రక్కన దొరికిన రెండుగంపల తుపాకీగుండ్లు.

పోషిన్ :- యిప్పుడు నీవు సజమైన బర్మాయువతివి. నువ్వు నిజంగా నా సహోదరివి అని చెప్పుకోవడానికి గర్విస్తున్నాను. అమ్మా! వెళుతున్నాం. ఆలస్యమైతే కష్టం -

విజయం సాధించి తీరుతాం. యీ ప్రయాణం మా విజయానికి తొలకరి. నమస్కారం తల్లీ!

యూటీల్ వాకా ఎడమపక్కగా వెళుతాడు. యూవాజా అతన్ని అనుసరిస్తాడు. టిన్ మే వెళుతూ తల్లికేసి విచారంగా కన్నీరు కారుస్తూ పోతుంది. పోషిన్ నెమ్మదిగా, గంభీరంగా సాగుతాడు.

దాసోమి :- (వాళ్లందరివంకా నిబ్బరంగా చూస్తూ) నాకోసం మీరెవ్వరూ బాధపడొద్దు – నాకేమీ ఫరవాలేదు. మీరంతా క్షేమంగా వెళ్లి, మన పనులుసాధించుకురండి.

వాళ్లంతా వెళ్లేవరకూ అలాగే చూచి కన్నీరు పెడుతుంది. కొంత కాలం తరువాత మొదటి జపాను ఆఫీసరు గొంతుక బిగ్గరిగా వినిపిస్తుంది.

మొ॥ జపాను ఆఫీసరు :- నలుగురు యిల్లు చుట్టముట్టండి. ఒకడు మాతో రాండి.

దాసోమి :- (లేని ధైర్యం తెచ్చుకుని) మళ్లీ ఆమూడు జపాను కుక్కలూ వస్తున్నాయి——

మొదటి ఆఫీసరు :- (చేతిలో పిస్తలు పట్టుకుని, కుడివైపునుంచి ప్రవేశం! అతని వెనుక పాటూ మరొక సిపాయి సాయుధులై యుంటారు.) ఎవ్వరూ కదల్లానికి వీల్లేదు. పరుగెత్తకండి–కాలుస్తాను.

దాసోమి ప్రశాంతంగా వాళ్లివైపు చూస్తుంది.

మొదటి ఆఫీసరు :- (అనుమానాస్పదంగా నాలుగు వైపులా చూచి) వాళ్లంతా యేరి?

దాసోమి :- అంటే, ఎవళ్లూ?

మొదటి ఆఫీసరు :- వాళ్లే, నీ మొగుడూ, పట్నంనుంచివచ్చిన నీ కొడుకూనూ.

దాసోమి :- (ధైర్యంగా కుడివైపుకు చూపుతూ) వాళ్ళంతా యిటు వెళ్లారు.

హాటా :- మేము యిప్పుడటునుంచే వస్తున్నాం- మా కెవ్వరూ కనిపించలేదే?

దాసోమి :- (విసుగుగా) అందుకెవరేం చేస్తారు ... చూడక పోవడం మీ తప్పు...యూటిల్ వాకా వాళ్ళను తన ఆశ్రమానికి రమ్మన్నాడు ... వాళ్లు వెళ్లారు.

హాటా :- ఆ యూటిల్ వాకా ఎవడు?

దాసోమి :- మీకు తెలియదు? వాడు నా కొడుకు. మీ రాత్రి మించుకున్న స్థూపంలోవుండే ఒక బౌద్ధభిక్షువూను.

మొదటి ఆఫీసరు :- సరే! హాటా, యిద్దర్ని కూడగట్టుకుని వెళ్ళి మరోసారి చూడు (కుడివైపు చూపుతాడు) ఇదిగో! నువ్వు (సిపాయితో) యీ ముసిల్దానిమీద ఒక కన్ను వేసివుంచు. నేను యింటిలోపలికి వెళ్లి చూసివస్తాను-

హాటా కుడివైపుకు పోతాడు. చేతిలో పిస్తలు జాగ్రత్తగా మరోసారి చూచుకుని యింటిలోపలికి వెళుతాడు. దాసోమి సిపాయిచేత కాపలా కాయించుకుంటూ నిబ్బరంగా కూర్చుంటుంది. ఒక్క క్షణమైన తర్వాత సిపాయి ఎడమవైపుకుజూస్తాడు. మొదటి ఆఫీసరు కోపంతో బయటుకువచ్చి సిపాయి చూస్తున్నవైపుకు చూస్తుంటాడు –

మొదటి ఆఫీసరు :- (కోపంతో) అక్కడున్నవాళ్లేగదూ? (దాసోమివంక కోపంగా జూస్తూ) యీముసలి పిశాచం మనల్ని మోసంచేస్తుంది.

దాసోమి కోపంగా నిర్భయంగా అతనివంక జూస్తుంది. సోల్జరు చేతిలోకి తుపాకి తీసుకుని పోషిన్ వాళ్లు వెళ్లినవైపుకు గురి చూస్తుంటాడు.

మొదటి అఫీసరు :- (సిపాయికి వెనుకగా దగ్గరిగా జరిగి) సరిగ్గా చూడు-వాళ్లను మనం పట్టుకుతీరాలి.

సిపాయి క్రూరంగా గురిచూసి ప్రేల్చబోతాడు. దాసోమి వుండబట్ట లేక మండే కట్టనొకదాన్ని గురిచూచి, బలంకొద్దీ, సిపాయిపైకి విసురుతుంది. అది వెంటనే వాడిచేతికి తగలటంవల్ల, గురితప్పి గుండు గాలిలోకి దూసుకు పోతుంది. దాసోమి బిగ్గరిగా నవ్వుతుంది.

మొదటి ఆఫీసరు :- (వెర్రికోపంతో రైఫిలు ఆమెకు గురిపెట్టి) నేనుగనుక జపానువాణ్ణయితే యిదుగో (కాలుస్తాడు) ఇదిగో! ఆసియా ఖండాన్నే మేము జయిస్తున్నాం! (మరోసారి కాలుస్తాడు) ఇదిగో మా విజయసూచకానికి మరొక్కటి (మూడోసారి కాలుస్తాడు) హోహోహోహో.

దాసోమి కడుపు గట్టిగా వత్తిపట్టుకుని అరుస్తూ కూలబడిపోతూంది. దీర్ఘ నిశ్వాస...

—తెర మెల్లగా జారుతూంది—

జపాను ఫాసిస్టులు తుపాకి మోతలతో కథఅంతం చేయబడింది. వెన్వెంటనే బర్మా పుత్రులు, స్వాతంత్ర్య వీరులు, ఆ ఫాసిస్టులపై. ఆ జపాను భూతాలపై ఎదురు తుపాకులు కాల్చారు. కొంత కాలానికి బర్మా ప్రజలు. తమ స్వాతంత్ర్యం కోసం "బర్మా రక్షణసైన్యం" గా యేర్పడి గెరిల్లా యుద్ధం చేశారు. జపానువారిని, హతమార్చి, పగసాధించుకున్నారు-



—సమాప్తం—



**మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | TPLA119B107 |
| పుస్తకం పేరు | విప్లవ సమిధలు |
| తారీఖు | 28/10/24 |
| ముందు అట్ట | NO |
| వెనుక అట్ట | NO |
| మొత్తం పేజీలు | 63 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | II,VIII |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | Apsar |
| పేజీలు విడదీసినది | Apsar |
| స్కాన్ చేసినది | Mounika |
| పరీక్ష చేసినది | DAVEED |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |